శ్రీగురవేనమః 

—:o:—

వేదాంతమను 

# అచలగ్రంథమును.

వసిష్ఠశ్రీరామసంవాదమునునగు

శ్రీరామహృదయంబను

# షట్చక్రవర్తుల యింద్రజాలపుకథలు.

—:(o):—

ఇది

పోకల-శేషాచలమునాయనివారిచే

రచియింపంబడి


వె. నా. జూబ్లీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపంబడియె.

రెండవ కూర్పు ౧౦౦౦—కాపీలు.






MADRAS.

౧౮౯౪ సం॥ జూన్ నెల ౧-తేది.




దీనివెల అణాలు ౮.

Price Annas 8.

## విషయసూచిక.

శ్రీగురవేనమః.

# ప్రకటన.

3783
155

శ్రీమద్వేదాంతసారుండును, అచలపరిపూర్ణుండును, అశరీరుండును నైన సద్గురుస్వామికిశిష్యుండగుపోకల-శేషాచలాహ్వాయుఁడు భక్తి వైరాగ్య,యోగ,జ్ఞాన, జ్ఞానాతీతములనెడు వేదాంతమార్గములు పుణ్యపురుషులును స్త్రీలును గ్రహించి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య,సార్ష్టిత్వ, మోక్ష, పరమపదవులనుబొందునటుల ఆంధ్రంబున వచనకావ్యంబుగరచియించి రిజష్టరుచేయఁబడిన గ్రంథములవివరం.

| | వెలలు. | | పోష్టేజి. | |
|---|---|---|---|---|
| | రూ | అ | అ | పై |
| సుజ్ఞానదీపమనుగురుగీత ౨౭౮ శ్లోక-టీక తాత్పర్యములతోడ | ౧ | ౮ | ౧ | ,, |
| శ్రీశివరామదీక్షితీయమను౧౮.అధ్యాయములుగలఅచలగ్రంథం | ౧ | ,, | ౧ | ,, |
| శ్రీకృష్ణబోధామృతమను పంద్రెండురాజుల కథలు ... | ౦ | ౧౨ | ౧ | ,, |
| శ్రీరామహృదయమను షడ్చక్రవర్తులయింద్రజాలపుకథలు ... | ౦ | ౮ | ౧ | ,, |
| శ్రీకృష్ణోద్ధవ సంవాదమను పరమపదమార్గము ... ... | ౦ | ౮ | ,, | ౬ |
| శుకవింశతియను చిలుకచెప్పిన ౨౫-కథలు ... | ౦ | ౮ | ౧ | ,, |
| సుజ్ఞానరత్నావళియను ౧౦౮ వేదాంతకీర్తనలు ... | ౦ | ౬ | ,, | ౬ |
| భక్తవిజయంబను పదుగురుమహాపతివ్రతలకథలు ... | ౦ | ౬ | ,, | ౬ |
| ఆత్మవిలక్షణసారము ... ... ... ... | ౦ | ౨ | ,, | ౬ |

శ్రీమచ్చెన్నపురంబున పెద్దినాయనిపేట నాటుపిళ్లారిగుడివీధి కవాటసంఖ్య(౨౦)గలమందిరంబునయీగ్రంథములుసదావిక్రయింపఁబడును. ఈరిజిష్టరుగ్రంథములనుగొనువారలకు౧౦-కి రూ. ౧౦- వంతునకమీషన్ అనగా తోశియివ్వబడును. రూ. ౧౦-లకుతక్కువగాకొనెడువారలకుకమీషన్ యివ్వబడదు.

౧౮౯౪ సం॥ }
జూను నెల ౧ - తేది. }

ఇట్లు,
గ్రంథకర్త
పోకల - శేషాచలమునాయఁడు.







శిష్యుడు- శేషాచలము నాయుఁడు　　అచలగురుడు-కోటప్ప దేవర.





సద్గురవేనమః

శ్రీరామహృదయంబను

# షట్చక్రవర్తుల యింద్రజాలపు కథలు.

---

శ్రీమద్వేదాంత ప్రవర్తకుండును, మహాయోగపురుషుండును, ప్రభావసంపన్నుండునునైన శ్రీచెంచురాజగురునకుశిష్యుండును, అచల గురుండైన అమినిగడ్డకోటప్పదేవరకుభక్తుండును, ఆత్రేయగోత్ర ఆది వెలమకులోద్భవుండగు పోకల-రామగోపాలునాయనివారికిఁ దృతీయ పుత్రుండునునైన పోకల-శేషాచలాహ్వయుఁడు ప్రకృతిద్వయదోషర హితుఁడైన సద్గురుస్వామిని మనంబున సేవించి ప్రాచీన దేశికస్వాము లైన సాందీపమహామునినిం బ్రస్తుతించి, శివరామదీక్షితులనుగీర్తించి, భాగవతుల కృష్ణదాసునింబేర్కొని, భక్తివైరాగ్యపరులకు భ్రమరూ పకమైన యొుకప్రభావమహాత్మ్యములును,తద్భ్రాంతినిరసనంబును, అచలపరిపూర్ణదర్శనంబును, జక్కఁగాబోధపఱచుటకై, యాంధ్రంబు న కథలరూపంబున వసిష్ఠ శ్రీరామసంవాదంబను శ్రీరామహృదయమ నెడుషట్చక్రవర్తుల యింద్రజాలపు కథలను జెప్పంబూనుకొనిన, నీ గ్రంథమునకు కథాక్రమంబెట్టిదనిన.

శ్రీమదఖండ సచ్చిదానందాద్వయ బ్రహ్మపరిపూర్ణభావుండును, భక్తజనరక్షకుండును, అశేషభూతాంతరాత్ముండును, మాయామాను షవిగ్రహుండును, దశరథమహారాజునకు సుపుత్రుండునునైన శ్రీరా మచంద్రుఁడు పాలించినకోసలదేశమునకుఁ బ్రధానపట్టణమైన య యోధ్యాపురీవిభవమునునేనేర్పుకొలదిగొంచెముగవివరించెదను.

చంద్రకాంతమణులు చెక్కఁబడి స్ఫటిక శిలామయములై మి గులధావళ్యములై సుందరములై తేజరిల్లెడు మహోన్నతములైనమే డలును, వజ్రముల ద్వారబంధములును, వైడూర్యకవాటములును, నీ లంపుటరుగులును, బవడంపు కంబములునుగలిగి, ఇంటింటను శ్రీరా మచంద్రుని జయప్రదమగు చరిత్రరూపపటములను జిత్రములుగాఁగో

డలయందు లిఖయింపఁబడి, మృగనాభి, యత్తరు, పన్నీరు, కుంకుమ పువ్వు, పచ్చకర్పూరాదిపరిమళద్రవ్యములను మేళనముచేసి, గుప్పగు ప్పున తావి సదా గుప్పునటుల చల్లఁబడి, యాణిముత్యముల ముగ్గు లచేతను,బచ్చలతోరణములచేతను విలసిల్లెడు విశాలములైన వీధులు ను, వివిధఫల కుసుమభరితంబులై మిగులవినోదకరములైన శృంగా రవనములును, సువర్ణరత్నఖచితంబులైన కేళికా గృహంబులును, బి సప్రసూనాది కుసుమవిసర భాసురంబులై స్ఫటిక శిలాసోపానములుగ ల సరోవరంబులును, సెలయేటి వెల్లువలందడిసి, చల్లగావీచుచుండెడు మలయమారుతంబును, పర్వతసమంబులైన రథంబులును, ఐరావతస మంబులైన మదపుటేనుంగులును, ఆదిత్యుని రథాశ్వములకంటెను వే గవంతములైన తురగములును, యమకింకరులవంటి వీరభట సమూ హంబులును గలిగి, దేవగణముచేతశ్లాఘింపఁబడి, శత్రువుల కసాధ్యం బై భూకాంతామణికి తిలకమువలె నొప్పుచుండు నాయయోధ్యాపు రంబును, శ్రీరామచంద్రుఁడు సుమంతాద్యష్టమంత్రులును, సామంత రాజులును, దమ్ములును, విద్వజ్జనంబులును, ఆర్యులును దన్నుపరివేష్టిం చియుండఁగా నిండుకొలువుకూటంబున యున్నతమైన రత్నసింహాసన ము మీఁదఁగూర్చుండి, రాజ్యమును బాలించుచు పురిజనులకు క్షేమ మునుగలిగించుచు, ధర్మదేవతను నాలుగుపాదములయందును నడపిం చుచు దేవగణ సేవితుండై యుండెను.

ఇట్లుండగా కొన్నిదినముల కారామచంద్రుఁడు, లోకోపవా దమును భరింపంజాలక మహాపతివ్రతాశిరోమణియును, మహాదేవి యునునైన సీతాదేవిని నిండుగర్భమని యోచించక నారాక్షసాం తకుఁడు నిర్దయుండై యడవికింగొనిపోయి జంపిరమ్మని తనతమ్మునకు నాజ్ఞాపించి,యనంతరము భార్యావియోగమును భరింపంజాలక శోకిం చుచు, నేమియునుఁదోచక రాజ్యమునువిచారించక దుఃఖసముద్రము లో మునిగి తపించుచు, యంతఃపురములోనున్నాఁడని వసిష్ఠమహాఋ షి వినిమిగులవగనొంది, యాయయోధ్యాపురికివచ్చుచుండెను.

శ్రీరామచంద్రుఁడు వసిష్ఠమహాఋషి వచ్చుటనుతన భటులవ లననెరింగి యామహాత్మునకు నెదురుగాబోయి యంతఃపురమునకు దో

డోఁ-నివచ్చి పాదములుకడిగి, తడియొత్తి, రత్నపీటముమీఁదంగూర్చుండఁబెట్టి,యర్చనవందనాది పూజలును, ధూపదీప నైవేద్యములును యథోచితముగ గావించి తృప్తిపరచి, - త్రిలోకపూజ్యుండవగు ఓ





శ్రీరామచంద్రుఁడు.　　వసిష్ఠమహాఋషి.

మునిసత్తమా! తమయాశ్రమమందుండు వృక్షలతాదులు సంతతము కుసుమఫల భరితంబులై యున్నవా? జలాశయములందునీరిసుమంతైనను గొఱంతపడక నిండారుగానుండునటుల నెలకు మూఁడువర్షములు తప్పక కురియుచున్నవా? దేవతలును ఋషులును సంతోషముతో నున్నవారలా? ధర్మదేవత నాలుగుపాదములతో వర్తించుచున్నదా? యని యడిగిన,యామునీంద్రుఁడు మందస్మిత వదనారవిందుఁడై, యాసీతాపతిందగ్గిరఁగూర్చుండఁబెట్టుకొని యతనిదేహమునఁ తనహస్తముతో దడవుచు,పుణ్యాత్మా! నాకును నాయాశ్రమమునకేకాదు త్రిలోకంబులకును క్షేమమే, మావంటి ఋషులు నిర్భయులుగా యోగసమాధులనుగావించుచున్నారు, దేవతలుత్సాహముతో సంచరించుచున్నారు, అజ్ఞానవృత్తియైన ప్రతిమారాధన నీదేవభూమినుండి పరిహరించుటంబట్టి

యును,గురుభక్తిమగుడిప్రబలించుటనుబట్టియును,సదా ఆత్మసంతుష్టి గలుగుటచేతను, ధర్మదేవత సంతోషముగా నాలుగుపాదములతో వర్తించుచున్నదని చెప్పెను. అంత నారాజేంద్రుఁడు తనపత్నిఁదలంచి నేత్రంబులం బాష్పంబులొలుక, యోమునిశ్రేష్ఠుఁడా!నాకు భార్యావియోగమును,భరింపంగూడని దుఃఖమును గలుగుటకు కారణమేమనియడిగిన యామునీంద్రుఁడు తనమనంబున నీపుణ్యపురుషుని • పెను దుఃఖమును, అచలబోధవలనం బోగొట్టుదమనియోచించి యతనిదేహమునుదడవుచు, నోరాజోత్తమా! నీవు నీనిజస్వరూపమును దెలియనిదోషముచేతనీకులేనిదుఃఖమును బొందుచున్నావు, నీవుఅచలపరిపూర్ణ బ్రహ్మముగాని యీవిశ్వరూపమైన మాయాశరీరమునీవు కావు, ఇంద్రియములుగావు, అంతరాత్మవుకావు, ప్రజ్ఞానచైతన్యములుకావు, పురుషుఁడవుకావు, స్త్రీకావు, నపుంసకుఁడవుకావు, నీకుసమానములేదు, అసమానుఁడవు, నీకువేదములు ప్రమాణములుకావు, నీవుజ్ఞానివికావు, అజ్ఞానివికావు, ప్రకృతిద్వయదోషరహితుండవు, నీకుభార్యలేదు, సోదరులులేరు, జననీజనకులులేరు,నీకుపుట్టుట గిట్టుటలులేవు, కేవలనిర్గుణుండవు, నిరంజనుఁడవు, నీకురెండవదిలేదు, అశరీరివి, అద్వయుండవు, నిన్నునిర్దేశించి చెప్పుటకు యుగములుచాలవు, కల్పములుచాలవు. జ్ఞానులును యోగులును నీనిజస్వరూపమునుగనజాలక, యానందస్వరూపమని లేనిదానినేజెప్పుదురు, వారును మాయకులోఁబడిన యెఱుకలోనివారేకాని విశేషజ్ఞులుకారు, పండితపామరులునీవలననమాయయెఱుకపుట్టినదనియును, నీవేకారణమనియును, నీయొక్క శబ్దములేశ్రుతులనియును, అధ్యారోపాపవాదమునుజేయుచున్నారేకాని,నిరామయుండవైననీవలన మాయయెఱుక యేకాలమునందును బుట్టనేలేదు. పుట్టించబడనులేదు. పుట్టినదనియునుదెలియదు, నిశ్శబ్దమైనయచల పరిపూర్ణబ్రహ్మ మేకాలమందును శబ్దసహితుఁడుగానుండలేదు, వేదము లహంకార సహితములు,అవికర్తలేకకర్మమునేజెప్పఁబడియున్నవికావున వేదములు నీకుం బ్రమాణములుకావు, నీనిజస్వరూపమేకల్పనారహితమైన,పరమపదమనిచెప్పిన,యారామచంద్రుఁడువిస్మితముఖుండై, మునీంద్రా! పంచమహాభూతములను బ్రపంచమును సృష్టించినవా

రెవ్వరనియడిగిన, యామునీంద్రుఁడు, రాజేంద్రా! పుట్టినవనిచెప్పుట అధ్యారోపాపవాదము. ఈవాదమెన్నటికిని చేయగూడదు, ఏకాలమందునుబుట్టనేలేదు, గొడ్రాలకుబిడ్డయుండునా, రజ్జువునందు చలనములేకనే సర్పభ్రాంతిపుట్టుచున్నది, అటువలెనే భ్రాంతిగలవారికి బ్రహ్మమునందుజగద్భ్రాంతికలుగుచుండునని చెప్పినయామానవేంద్రుఁడుభ్రమయెవరికి, తోఁచినదెవరికనియడిగెను.ఆమునీంద్రుఁడు"భ్రమేణాహంజగత్తని"యున్నదిగనుకయెఱుకకేభ్రమ యెఱుకకేతోఁచుచుండును, తన భ్రమకుఁదానేయానందించుచుండును, వితర్కించి దుఃఖించుచుండును గనుక నీభ్రమరూపకమైన ప్రపంచము యెండమావులవంటిది సమీపించిపోయిన నీళ్లులేనట్టు యీమాయయెఱుకే మటుమాయముగాఁబోవును, అచలబ్రహ్మమునకంటెను వేరొండులేదు, మాయాశరీరములకు మూలములేదు, మూలములేక తనకుఁదానేవచ్చి తనకుఁదానే మూలములేనిదానిని వివాహముచేసుకొని,మూలములేని బిడ్డలనుగని తన మాయకుఁ దానేవినోదమునొందుచు వేడుకపడుచు సుఖదుఃఖములను భవించి తనకుఁదానేమటుమాయముగాఁబోవుచుండును. స్వప్నమునందు గజవాహనారూఢుఁడై దివ్యభూషణములచేతనలంకృతుండై నవరత్నఖచితములైన కిరీటముమకరకుండలములుశోభిల్లఁగానొకరాజేంద్రుఁడువచ్చెను, అతనివెంట కోట్లకొలఁదిరథములును, యేనుఁగులును, గుఱ్ఱములును, గాల్బంటులునువచ్చిరి. ఆరాజేంద్రుఁడు తన్నుమన్ననచేసిరత్నపల్లకిలోఁగూర్చుండఁబెట్టుకొనితనపట్టణమునకు వెంటఁబెట్టుకొనిపోయి వివిధమర్యాదలుగావించెను,మహారమ్యమైన యాకొలువుకూటమును యందుండునవరత్నములను సువర్ణపునాణెములనుజూచి యద్భుతము నొందుచుండఁగా నాస్వప్నద్యవస్థపోయి జాగ్రతయవస్థకువచ్చి నేత్రములనువిచ్చిచూడగా నవియన్నియునుమాయమై యేమియునుగనుపించకుండుట సహజమనితెలుసునుగదా, స్వప్నమునందువచ్చిన శరీరములకు యీశరీరములకు హెచ్చుతక్కువలులేవుగదా, వాటినియెవరురప్పించిరి, యెవరుగొనిపోయిరి, తమంతటతాము మూలములేకనే వచ్చి మూలములేకనే మటుమాయముగాఁబోయెను. సత్యమునందసత్యముయేకాలమందును బుట్టలేదు, పుట్టింపబడనులేదు, మనుష్యుల

కుమనుష్యులును,యేనుఁగులకు యేనుగులును, గుఱ్ఱములకుగుఱ్ఱములు ను, చీమలకుచీమలును బుట్టుచున్న దేగాని వేరేపుట్టడము లేదుగదా; ఇటువంటిదృష్టాంతములు పెక్కులుండగా సత్యమునందుసత్యమేపుట్టును గానియసత్యమెటులపుట్టును పుట్టనేపుట్టదు, పుట్టింపబడనులేదు, గొ డ్రాలకు బిడ్డ యేకాలమందునుబుట్టలేదు, బిడ్డపుట్టినయెడలతల్లి గొ డ్రాలుయెట్లగుంగావున భ్రాంతివల్లనే సమస్తముతోచుచుండును,భ్రాం తియున్నవారందరును స్వప్నమునందున్నవారేకాని వేరుకాదు, గురు వాక్యముచేత మేలుకొనినయాపుణ్యపురుషులకునీగుట్టంతయుబట్టబయ లు, మఱలవారికి భ్రాంతిపుట్టనేరదనిచెప్పిన యారామచంద్రుఁడాశ్చ ర్యపడి, స్వామీ! నేనిదివరకిట్టి బోధనువినలేదు.మాయయెఱుకలోనివే దములనుభక్తియోగజ్ఞానములనునాకుబోధించిరేగాని మీవలెయెవ్వ రున్నుజెప్పలేదు,ప్రపంచమునుశరీరములునుగనుపించుచున్నవేయనిపలి కెను.ఆమునీంద్రుఁడు, బిడ్డా! జాలకులుదమయొద్దలేని యావస్తువులనెల్ల సంకల్పమాత్రంబునరప్పించి యెదుటివారికిఁజూపించి యానందమును బొందించునటుల లేనియెఱుకేయింద్రజాలముభంగి భ్రమికులను భ్ర మింపఁజేయుచుండునని చెప్పెను. ఆరామచంద్రుఁడు,స్వామీ మునినా థా!యింద్రజాలమని చెప్పితిరి.ఆవిద్యయెటువంటిది. అట్టివిద్యగలవారిప్పు డుందురాయనియడిగిన,యామునీంద్రుఁడు,రాజేంద్రా! యింద్రజాలమ హేంద్రజాలాదివిద్యలుషట్చక్రవర్తులదినములలోనుండెను,బిదపభాస్క రుండనువానితోడ నావిద్యలునశించెను. ఇప్పుడింద్రజాలమహేంద్రజా లవిద్యలులేవు జాలవిద్యగలవారెందైననుందురని చెప్పినయతడావిద్యయె న్నివిధంబులై యుండెను, షట్చక్రవర్తులదినములలో నామాయకులు వచ్చియేమేమి వినోదములనుగావించిరి,వాటిని నాకువేరువేరుగావినిపిం చుడనివేడిన యామునీంద్రుండిట్లనియె.

రాజేంద్రా! జాలమనియును, ఇంద్రజాలమనియును, మహేం ద్రజాలమనియును, మూడువిధములుగా విభజించఁబడియున్నది. ఈ మూటికియింద్రజాలమని పేరు. ఈవిద్యగలవారు విశేషముగాగురుసే వచేసివారివలనఁగ్రమప్రకారము తమచిత్తమునులోపఱచుకొనిచిదా కాశమువరకును వ్యాపించి యట్టిచిదాకాశమునకు మిత్రత్వముగలవి

మయూరములగుటంజేసి యానెమళ్లయాకలను గుంచెగాఁగట్టుకొని యింద్రజాలకులు తమజాలమునుజూపించి వినోదమునుబట్టింతురుగావున యట్టియింద్రజాలమేభ్రమరూపకమైనమాయ, అదియేమెఱుక,అదియేమహేంద్రుఁడు, అదియేశ్రీమన్నారాయణమూర్తి, అదియేసదాశివుఁడు అదియేచతుర్ముఖబ్రహ్మ, అదియేసృష్టికర్త, అదియేగణపతి,అదియేజీవేశ్వరులు, అదియేచైతన్య స్వరూపిణియనుయమ్మవారు, అదియేముక్తికాంత, అదియేమహాశక్తి, అదియేయంతరాత్మ, అదియేప్రజ్ఞానంబ్రహ్మ, అదియేచిద్బ్రహ్మము, అదియేచిదాకాశము, అదియేత్రిపుటి, అదియేజ్ఞానము, అదియేజ్ఞేయము, అదియేకర్త, అదియేభోక్త,అదియేయాత్మ, అదియేదేహము, అదియేసర్వేంద్రియములు, అదియేప్రపంచము, అదియేజగము, అదియేలోకము, అదియేనామరూపంబులు, అదియేబంధమోక్షంబులు, అదియేపుణ్యాపాపంబులు, అదియేకల్పనాసహితమైనకైలాసము, అదియేకల్పనాసహితమైనవైకుంఠము, అదియేకల్పనాసహితమైనసత్యలోకము, అనగాబ్రహ్మపట్టణము, అదియేకల్పనాసహితమైన సాలోక్యము, అదియేకల్ప నాసహితమైనసామీప్యము,అదియేకల్పనాసహితమైనసారూప్యము, అదియేకల్పనాసహితమైనసాయుజ్యము,అదియేకల్పనాసహితమైనసార్ష్టిత్వము,అదియేకల్పనాసహితమైనమోక్షము,ఇవియన్నియును మాయాసంబంధములైనపదవులు,భ్రమరూపకములుగానిస్థిరములుగావు, మాయమెఱుకకుయెంతటిస్థిరమో యంతటిస్థిరమైనవేయీపదవులు,జన్మశూన్యముకలుగనేరదు,పునర్భవరూపకములైనపదవులనిచెప్పిన,యారామచంద్రుఁడద్భుతమునొంది,మునీంద్రానాచిత్తముయింద్రజాలపువినోదములనేవినగోరుచున్నది, అదిమూఁడువిధములనిమీరుసెలవిచ్చితిరి,వాటివినోదములనువేరువేరుగావినుపించుడనివేడిన యామునీంద్రుండిట్లనియె.

రాజేంద్రా? జాలమనగా జాగ్రతయందు కన్నులకెదుట, లేని చిత్రవిచిత్రములును,ముందెన్నఁడు చూడనిరూపములునుజూచిచిత్తానందమును, భయోత్పాతము లును, పెక్కుయాశ్చర్యములును, సంతోషదుఃఖములును గలిగివెంటనే యవియన్నియునశించి, యేమియునగనుపించకుండుట.

ఇంద్రజాలమనగా స్వప్నమునందు దేవలోకమును, ఇంద్రాది దేవతలదర్శనమును,త్రిమూర్తులదర్శనమును, నానావిధవింతులును, వివిధవిచిత్రములును, మిగులసుందరములైన, దేవతాస్త్రీలతోకూటమియును,అద్భుతమైనసుఖానందమును,అలవిగాని దుఃఖమునుగలుగుటయును, మనోనిశ్చయమును, నవరత్నములను, సువర్ణమునుగాంచుటయును, నేత్రములను దెఱచినవెంటనే యవియన్నియునశించియేమియునుదోచఁబడకుండుట.

మహేంద్రజాలమనగా స్వప్నమునందు దేవలోకగమనమును ఇంద్రాదిదేవతలదర్శనమును, త్రిమూర్తులదర్శనమును. మహేంద్రుని దర్శనమును, దేవకన్నియలకూటమును, మిగులసుఖానందమును, అద్భుతమైన దేవవాద్యములవినుటయును,చిద్బ్రహ్మముయొక్క లీలావిలాసమగుచిత్రవిచిత్రమైనవినోదములను జూచిచి త్తవిభ్రాంతినొందుటయును, భ్రమణముచేత నేమియునుదోచకుండుటయును, భరింపఁగూడనిభయోత్పాతములును, అలవిగానిసుఖానందమును, మితిలేనియనుభవమును, దుఃఖమునుగలిగి నేత్రములను దెఱచిన వెంటనేయవియన్నియును మాయమై యేమియునుగనఁపించకుండుటయని చెప్పినయా రామచంద్రుడు,మునీంద్రా! హరిశ్చంద్రచక్రవర్తి దినములలోనింద్రజాలకులువచ్చి యేమేమివినోదములుగావించిరి, దేవరవారుదయతోనా కెఱిగించుడని వేడినయాతపోధనుండిట్లనియె.

—*(హరిశ్చంద్రచక్రవర్తికథ.)*—

రాజేంద్రా! తొల్లిహరిశ్చంద్రచక్రవర్తినవఖండమండలాధిపతియైభూమండలమంతయునేకఛత్రమునబాలించుచు,ధర్మమునునాలుగు పాదములయందునునడిపించుచుండఁగా,నొకనాడామండలాధిపతి సభకు జలజనాభుండనుయింద్రజాలకుఁడువచ్చి తనవిద్యావినోదమును జూపించుటకుయత్నించి తనహస్తమందుండిన నెవలియాకలకుంచెనుప్రభువునకుంద్రిప్పి చిత్తసంకల్పమునుబొందించెను. తాంబూలముసేయుచు, ఆకుమడుపును దక్షిణకరమునం బుచ్చుకొనినరాజేంద్రునకు ఇంద్రజాలకునిప్రభావమువలన నిద్రమైకము సంభవించి నేత్రములనుమూసినం జూచి మంత్రులును, ప్రధానసామంతరాజులును, సభికులును, ప్రభువు



నకుసుషుప్తికలిగెను సందడిచేయక నిశ్శబ్దముగానుండుడనిగీత, నృత్య గానములుచేయువారికిం జెప్పి యందరునిశ్శబ్దముగానుండిరి. ఆమండలాధిపతి నేత్రములనుమూసినవెంటనే యతనికిఁగొప్పవెలుగును మిగులవి

నోదకరములైనవనములను దానెన్నడుచూడని ఫలవృక్షములను బు ష్పలతలనుజూచి, ఓహో! యీవింతవనమెక్కడిది పోయిచూచెద మని దిగ్గునలేచిపోవుచు నావృక్షలతలనుజూచి యద్భుతమునొందుచు, గుప్పుగుప్పునగుప్పుచుండెడు సుగంధతావినాఘ్రాణించుచు, మాధుర్య ఫలములనుగోసిభక్షించుచు, చిత్రములైనసరస్సులలోదిగి జలపానము సేయుచు, సెలయేళ్లప్రవాహములలోనీదుచు, శుకపికశారికాదిపక్షు లు మధురధ్వనులకు నానందించుచు, చెట్లనీడలవిశ్రమించుచు, పూపొ దరిండ్లలోదూరుచు, చిత్రములైనమంటపములనుజూచివిస్మయమునొం దుచు, ఇదియేలోకమో యెవరివనమోయని సంకటమునొందుచు, మ హదానందముతో నలుదిక్కులుచూచుచుంబోయిపోయి యొకప్రదేశ మున మిగులధావళ్యమై మనోహరమై వినోదకరమైన నడకగలగొప్ప పక్షినింజూచి నేత్రోత్సవమునుబొంది ఆహా యిదిమిగులవింతయైన పు లుఁగుగానున్నది దీనిఱెక్కలుమిగులసుందరములు, ఇట్టివింతయైనపక్షిని మనమెన్నడునుజూడలేదు, ఇదియెందుండివచ్చెనో తెలియదు మనభా ష తెలిసిమాట్లాడిన మిగులవేడుకగానుండుననియోచించి యత్యంత యుత్సాహముతోనాపక్షిసమీపమునకుంబోయి, ఓపక్షీంద్రా! నీవుయే లోకమునుండివచ్చితివి, ఇదియేలోకమునీవుయేజాతిపక్షివి నిన్నుఁజూడ చూడ నాకువేడుకగానున్నది నిన్నువిడిచి పోవుటకు నాకుఁగాళ్లాడలేదు. నేనుహరిశ్చంద్రచక్రవర్తిని నీవృత్తాంతమంతయునుజెప్పి నీవునాపురికివ చ్చితివేని నిన్నుముద్దుచేసి నీకుందగినయాహారము నిప్పింతునని పలికిన యారాజహంస యతనికిట్లనియె.

రాజేంద్రా! నేనుచైతన్యస్వరూపిణియనుపక్షిని, నారాకపోకలేప్ర ణవాక్షరద్వయము, అదేసోహము, ఆయక్షరద్వయవికారములే వేదము లు, భక్తియోగజ్ఞానులు, నన్నురాజహంసయనియునుపరమహంసయని యునుజెప్పుదురు, నాసహాయమువలన ముముక్షులువారికోరికలు నెరవే ర్చుకొందురు, నేనుసత్యలోకమునుండి భూలోకమువరకు సంచరింతును, నేను లేనిలోకముపాడైపోవునుగాఁబట్టి నాకెందునుసెల్లడలేక షడాధా రములకుతంతిరూపకమైతిరుగుచుందును, నాకుదివారాత్రులునుజాగరణ స్వప్నసుషుప్త్యాద్యవస్థలునులేవు, హృదయాకాశమునక్షణకాలమునిలిచి

దేవనాగరత్నములనుభక్షించి, మానససరోవరములోనిసుధాపానమును జేయుదును నీవునాకేమియాహారమునుబెట్టెదవనిపలికెను. ఆమండలాధిపతియద్భుతమునొందియారాజహంసకునమస్కరించి, ఓహోయాత్రిలోకపావనమైనపక్షీంద్రమానీవర్తమానము మిగులయద్భుతముగానున్నది. సత్యలోకమునుబాలించువారెవ్వరు,అందుండువిశేషములెట్టివిదయతో నాకెఱిగించుమనివేడిన యామరాళంబిట్లనియె.

రాజేంద్రా! సత్యలోకమునుజైతన్యస్వరూపిణీయను అమ్మవారు పాలించుచున్నది, ఆలోకమును శ్వేతద్వీపమనియునుజెప్పుదురు,అందుది నారాత్రులనితెలియఁబడకకోటిసూర్యులుచంద్రులు నేకకాలమునఁబ్రకాశించునటులగొప్పవెలుఁగుప్రకాశించుచుండును,ఆమూర్తికాంతామణియైనసత్యవేణిదివ్యరత్నపీఠంబుపైన శ్వేతపద్మసింహాసనముమీదంగూర్చుండిముముక్షులకుదర్శనమిచ్చుచుండును,ఆదేవినివర్ణించిచెప్పుటకుత్రిమూర్తులకైనయలవిగాదు,ముముక్షులుతలంచినతలంపుల ప్రకారము పెక్కురూపములనుబొందినిత్యానందసుఖములనిచ్చుచుండును.మఱియు నచటముముక్షులకుతొమ్మిదివిధములుగలదివ్యరత్నసోపానములుండును, ఆసోపానములు వ్యత్యస్తపుప్రభావతేజోకాంతులచేతవిలసిల్లుచుండును. అందుమొదటిసోపానముమీదజ్ఞానులును. రెండవసోపానముమీదయోగులును,మూడవసోపానముమీదప్రణవధ్యానులైనభక్తులును,నాలవసోపానముమీదజితేంద్రియులును,ఐదవసోపానముమీదనభ్యాసపరులును, ఆఱవసోపానముమీదవైరాగ్యపరులును,ఏడవసోపానముమీద గురుశుశ్రూషకైంకర్యపరులును, ఎనిమిదవసోపానముమీదసూనృతవాక్యులును,తొమ్మిదవసోపానముమీదనేకపత్నీవ్రతస్థులునుగూర్చుండిసంతతమాదేవినిసేవించుచుందురు, నేజెప్పినయీతొమ్మిదివిధములుగలభక్తులలోనీవునొకడుగానుండినమెడలనిన్నుఁగొనిపోదుననిపలికెను.ఆరాజేంద్రుడు కడుసంతోషముతోనాయంచంజూచిరాజహంసమానేనుసూనృతవాక్యపరిపాలకుండను,నన్నుదయతోఁగొనిపొమ్మనివేడినయామరాళముమంచిదనియతనిందన మూపుమీదంగూర్చుండఁబెట్టుకొని యతిరయంబునం బోవుచుండెను. ఆరాజేంద్రుఁడు మిగులధైర్యముతో నాహంసనెక్కిపోవుచునామార్గమున కాంచనరత్నములతోభాసిల్లుచుండెడు పట్టణమ్మును,

దానికిమధ్యభాగముననాధారకమలమును, ఆకమలమునకునాలుగుదళములయందును,వ-శ-ష-స-అను నాలుగుయక్షరములుకలిగిమధ్యభాగమునమెప్పుచుండెడుఓంకారబీజాక్షరంబును,అందుకనకరత్నపీఠంబునంగూర్చుండినయొకపురుషునింగాంచియద్భుతమునొందిరాజహంసమా!ఇదియేలోకము, ఈమహాత్ముండెవ్వఁడనియడిగినయామరాళముపుణ్యాత్మా!యిదిభూలోకము,ఇతఁడుసర్వవిఘ్నములకు కారకుండును, అధిదేవతయునునైనవిఘ్నేశ్వరుఁడు,నీవీమహాత్మునింధ్యానించుమనిచెప్పియాంరాజహంసయచటనుండి రెండువేలయోజనములదూరముపోయెను.

అప్పుడారాజేంద్రుఁడు దివ్యవజ్రములతోమిగులధావళ్యమై ప్రకాశించెడుపట్టణమును,దానికిమధ్యభాగమున స్వాధిష్ఠాన కమలమును, ఆకమలమునకునారుదళములయందును, బ-భ-మ-య-ర-ల-అను ఆరక్షరములుకలిగి,మధ్యభాగమునమిగుల తేజోవంతమై వెలుఁగుచుండెడు న-కారబీజాక్షరంబును అందు శ్వేతపద్మంబునంగూర్చుండినయొకదివ్యపురుషునింగాంచి యాశ్చర్యమునొంది రాజహంసమా. ఇదియేలోకముఈమహాత్ముండెవఁడనియడిగినయాయంచపుణ్యాత్మా ఇదిభువర్లోకము ఇతడుసర్వప్రాణులను సృజియించుసృష్టికర్తయునధిపతియునైన బ్రహ్మదేవుండు,నీవీమహాత్మునింధ్యానించుమనిచెప్పి యారాజహంస యచటనుండియెనిమిదివేలయోజనములదూరముపోయెను.

ఆమండలాధిపతియచటకాంచనరత్నములచేతఁదళతళమెఱయుచుమిగులమనోహరమైనపురమును,దానికిమధ్యభాగమునమణిపూరకకమలమును,ఆకమలమునయొక్క-పదిదళములయందును, డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-అను బదియక్షరములుగలిగి మధ్యభాగమున అత్యంతకళలతోఁదేజరిల్లుచుండెడు మ-కారబీజాక్షరముగలిగికుక్కుటాండాకృతియైనదివ్యసింహాసనముమీఁదంగూర్చుండిన మహాత్మునింగాంచియద్భుతమునొంది రాజహంసమా! ఈలోకమెయ్యది ఈమహాత్ముఁడెవఁడనియడిగినయామరాళమురాజేంద్రా!ఇదిసువర్లోకము,ఇతఁడుసర్వభూతములనుబెనుచుకర్తయునధిదేవతయునైనవిష్ణుదేవుండు, నీవీమహాత్మునింధ్యానించుమనిచెప్పి యారాజహంసయచటనుండిపంద్రెండువేలయోజనములదూరముపోయెను.

ఆచక్రవర్తి యచటదివ్యరత్నకాంతులచేతనొప్పుచుండెడుపురము ను,దానికిమధ్యభాగమున అనాహతకమలమును, ఆకమలముయొక్క పండ్రెండుదళములయందును,క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ- అను బండ్రెండుయక్షరములుకలిగిమధ్యభాగమునదివ్యకళలతో వెలుఁగుచుండెడు శి-వర్ణమనుబీజాక్షరముగలదివ్యసింహాసనముమీఁదఁగూర్చుండిన మహాత్మునింగాంచి విస్మయమునుబొందిరాజహంసమా!ఇదియేలోకము ఈమహాత్ముండెవఁడనియడిగినయామరాళము రాజేంద్రా యిది మహర్లోకము,ఇతఁడుసంహారకర్తయునధిదేవతయునైన శివదేవుండు,నీవీమహాత్మునింధ్యానించుమని చెప్పి యారాజహంస యచటనుండి పండ్రెండువేల యోజనముల దూరముపోయెను.

ఆరాజేంద్రుండచటదివ్యరత్నములచేత తేజరిల్లుచు మిగుల మనోహరమైనపట్టణమును, దానికిమధ్యభాగమున విశుద్ధకమలమును,ఆకమలముయొక్క పదియారుదళములయందును, అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః-అను పదియారుయక్షరములుగలిగి మధ్యభాగమునఁగడు తేజంబై వెలుఁగుచుండెడు వా-యనుబీజాక్షరము కలిగి హేమతామరసముమీఁదఁగూర్చుండిన దివ్యపురుషునింజూచియద్భుతమునొందిరాజహంసమా!ఇదియేలోకముఈమహాత్ముండెవఁడనియడిగినయాయంచ రాజేంద్రా! ఇదిజనర్లోకము ఇతఁడుసర్వభూతములకుఁగార్యస్వరూపుఁడైన జీవుండనియునధిదేవతయనియునుజెప్పియచటనుండియామరాళము పదివేల యోజనములదూరముపోయెను.

ఆమండలాధిపతి మిగులధైర్యముతోడంబోయియచటదేవనాగమణులతోభాసిల్లుచురవిచంద్రులకాంతులకుమించి వెలుగుచుండెడు మాణిక్యమంటపమును, దానికిమధ్యభాగమున యాజ్ఞేయకమలమును, ఆకమలముయొక్క రెండుదళములయందును, హం-క్షం-అనురెండక్షరములుకలిగి మధ్యభాగమునతళుకుతళుక్కనివెలుఁగుచుండెడు య-కారబీజాక్షరముగలతమ్మిగద్దియపైకూర్చుండిమహాతేజంబుతో నొప్పుచుండెడుదివ్యపురుషునింగాంచియాశ్చర్యానందభరితుండై రాజహంసమా! ఇదియేలోకముఈమహాత్ముండెవఁడనియడిగినయాయంచ రాజేంద్రా! ఇదితపోలోకము, ఇతఁడాత్మస్వరూపుఁడు, కారణపురుషుఁడు, మాయాశక్తి

నింగూడినమహాత్ముఁడు, నీవుయిచటదిగి యీమంటపములోనుండుము ఇచటికి రెండువేలయోజనములదూరములో నాసత్యలోకముండును, ఇచటనుండి యీసత్యలోకమువరకుమహాప్రకాశముకలిగియుండును, నేనుజెప్పినతొమ్మిదివిధములుగలభక్తులందరు దివ్యవిమానములెక్కి యీసత్యవేణినిందర్శింపఁబోవుచుందురు, నీవునిజముగాసూనృతవాక్యపరిపాలకుండవైనయెడల నీకుదశవిధనాదంబులును దోడ్పడవచ్చును,ఈగంగయమునలలోమజ్జనమాడి దివ్యవిమానమునెక్కి నీవును సహస్రారకమలమనెడు సత్యలోకమునకుంబోయి నీకునియమించినసోపానముమీదంగూర్చుండియమృతపానముచేయుచునానందాబ్ధిలో దేలుచుండుము నేనుమగుడిక్రిందిలోకములకుంబోయెదనని చెప్పి అచటనుండిమఱలెను.

అంతనాహరిశ్చంద్రచక్రవర్తితనభాగ్యమేభాగ్యమనిమిగులయుత్సాహమునుబొందుచుమహాత్ములను దర్శించుచుతానెంతకాలము నిరీక్షించియుండినసుదనకుదశవిధనాదములు తోడ్పడిరాకుండుటకు వగచియయ్యోయిదియేమియన్యాయము రాజహంసచెప్పిపోయిన ప్రకారము దశవిధనాదములుసహాయముగరాకుండెను, నాదౌర్భాగ్యమేమో తెలియదు, నేనెవ్వరితోఁజెప్పుకొందును, నాకిచటదిక్కెవ్వరు,ఏమిసేయుదుననిమనంబునవిచారమునొందుచునాగంగయమునలలోనైన స్నానము చేయుదమనియోచించి సమీపమునకుంబోయినయీదేవనదములురెండునుగనుపించకుండెను. అంతనాహరిశ్చంద్రచక్రవర్తికిభయమునుదొట్రుపాటునుగలిగి పట్టకూడనిదుఃఖముతో నకటానన్నాదరించిరక్షించువారెవ్వరనియేడ్చెను. ఆరాజేంద్రునకుఁగుండలిశక్తిప్రత్యక్షంబై రాజేంద్రా! నీవేలదుఃఖించెదవునీవుసత్యశీలుండవనియెంచివచ్చితివిగాఁ బోలును,అకటానీనిశ్చయమునీకులేకపోయెనా,పుత్రునివిషయమైనీవువరుణదేవునితోఁబొంకినబొంకునీచిత్తమునకుందెలియదా,పృథాభ్రమలెందుకు నీకుసత్యవేణిదర్శనముకలుగనేరదు, అసత్యవేణిదర్శనముకలుగుటకు సందియములేదు,నీమనోదుఃఖమునువిడిచి యజ్ఞానభూమికింబోయియీయసత్యవేణితోసుఖించుమనిపలికియీభూతమతనినెత్తుకొనివచ్చియజ్ఞానద్వీపమునవిడిచి మటుమాయముగాఁబోయెను.

అంతనాచక్రవర్తి నలుదిక్కులుపరికించియెవ్వరినిగానక దూర

ములోనొకపట్టణమునుగాంచి విచారపడుచునోదైవమా,పుత్రుని విషయమైనేనెక్కడకపటమునువహించితిని, బిడ్డమీదిగారాబముచేతదినములుగడపితినేగానిబలిపెట్టుటలేదనిచెప్పలేదుగదా, ఈవిషయములో నన్నబద్ధునిగానెంచుటెట్లనివిచారమునొందియేమియునుదోచక,ఈద్వీపమునననన్నురక్షించువారెవ్వరునేనేమిచేయుదునని దుఃఖించుచుండినయతనియొద్దకు యొకస్త్రీరత్నమువచ్చి తనదేహకాంతులచేతనతని డెందమునుగరగించియయ్యామీరెవ్వారలుయెందుండివచ్చితిరి దుఃఖించుటకుగతంబెయ్యదినీవృత్తాంతమంతయుఁదాచక వినుపించుమని యడిగిన యతడుతనవర్తమానమంతయుంజెప్పివిచారమునొందితన్నుదానిందించుకొనినయూవనజనేత్రియాదరణీయముతోనతనికిట్లనియె.

రాజేంద్రా! వంధ్యాసూనుఁడనుమహేంద్రునకుసత్య వేణియనియును, అసత్యవేణియనియును, ఉళక్కవేణియనియును, ముప్వురు పుత్రికలుగలరు,వారిలోపెద్దపుత్రిసత్యవేణి,యదియేముక్తికాంత మహామహిమలుగలది,విశేషమైనభ్రమలకుహేతుభూతురాలు, యుగములపర్యంతము సమాధినిష్ఠలుసాధించిసజ్జనులును, యోగులును,భక్తులును ఆదేవివలన మోసపోయి యాభ్రమలలోఁదగులుకొని పునర్భవమును బొందుచుందురుగాని జన్మశూన్యముకలుగనేరదుగదా, వివేకపరులు జన్మశూన్యమైనయచలమార్గమునేగోరుదురుగానికల్పనా సహితములైనపదవులనుగోరరు, భ్రమనువిడుచులే జన్మశూన్యముకాఁబట్టియసత్యవేణికంటెనుసత్యవేణియందుభ్రమవిశేషము. అసనాభ్యాసనాది సాధకములే బంధమోక్షములకుమూలముకాఁబట్టిసత్యవేణిశ్రేష్ఠమనియును, అసత్యవేణితక్కువయనియునుసేవెంచవలదు పదార్థములయొక్క చవిగొనినవారికిపదేపదే భ్రమపుట్టనేరదు,రుచిచూడనివారికి జ్ఞప్తివిశేషముగాఁగలుగుచుండును, మాయసత్యవేణియద్భుతమైన రూపులావణ్యములుగలిగిత్రిమూర్తులకునసాధ్యంబై యీద్వీపమంతయును పాలించుచున్నది,ఏకాబద్ధకునింగోరియున్నది,సౌభాగ్యవశముననిన్నువరియించుననితోఁచుచున్నది, నేనాదేవియొక్కచెలికత్తెయనుమాద్వీపమునసించుకైనమన్నును రాళ్లనుదొరకవు,మన్నంతయునుస్వర్ణమె,రాళ్లన్నియును రత్నములేయనిసంభాషించుచుండెను.

ఇంతలోనాయసత్యవేణి దివ్యరత్నసువర్ణఖచితంబైన పల్లకిలో గూర్చుండిమంగళవాద్యములతోబయలు వెడలివచ్చుచుండెను. వేలకొలఁది చేడియలుబరాబరులు చేయుచు నాయుధములనుధరియించిముందుగా వచ్చుచుండిరి. విశేషముగాగుఱ్ఱములును యేనుఁగులునువచ్చుచుండెను, సూర్గురుమత్తేభయానలు దివిటీలవలెగొప్పదేవనాగరత్నములను దమహస్తములలోఁబెట్టుకొనిపల్లకివెంబడి మంగళములుపాడుచురాఁగాఁగొందఱిందువదనలుగుప్పుగుప్పనసుగంధపుప్పొడిని చల్లుచు రాఁగా,మఱికొందఱుకలువకంటులు కుసుమములనుజల్లుచురాఁగా, దశవిధవాద్యములతోడనాబిసరుహదళాక్షి వచ్చిక్రొక్కాఱుమెఱుంగు తెఱంగునపల్లకిలోనుండిబైటవచ్చినంజూచి యారాజేంద్రుఁడు వెఱఁగుపడి నేత్రములను మూసికొనిని శ్చేష్టితుండై భూమిమీఁదంబడెను. ఆకన్యకామణిత్వరితముగనతనిదగ్గిరకువచ్చిముఖమునందుపన్నీరుచల్లి లేవదీసి కూర్చుండఁబెట్టి పుణ్యాత్మా నేనుగన్నియనుగానిమెఱుపుతీగెనుగాను,నన్నుజక్కఁగాదృష్టించిచూచిభ్రమనువిడువుము సత్యవేణివలెదృష్టిపథమునకుంచగులనివాయులాడినిగాను సంతోషముతోఁబట్టపుటేనుఁగునెక్కి పురిలోనికిరమ్మని ప్రార్థించెను. అతఁడుగజమునెక్కెను. ఆయసత్యవేణిముఖలపల్లకిలోగూర్చుండెను. చేడియలుమంగళములుపాడుచునాయిరువురిమీఁదనుబుప్పొడినిఁజల్లుచుమంగళవాద్యములనుభోరుకొల్పించుచు యూరేగింపుతోవెంటఁబెట్టుకొనిపోయి యంతఃపురములోఁజేర్చి యావధూవరులకుమంగళస్నానములుచేయించి దివ్యవస్త్రాభరణములనలంకరించి భోజనంబులు పెట్టి యావధూవరులచేతఁ బ్రమాణములుచేయించి గాంధర్వవివాహమునుగావించిరి. ఆరాజేంద్రుఁ డత్యంత రూపసియు యవ్వనియునైన యసత్యవేణితో సుఖానందములనుభవింపుచుఁ బ్రతిదినము నూతనవస్త్రాభరణములచే నలంకరింపఁబడుచు, నూతనపదార్థములనుభుజియించుచు దివారాత్రులనిమెఱుంగంబడక కేళికాగృహమును విడిచిరాక సుఖించుచు, నామేడకుందాపించిన వజ్రములను రత్నములనుజూచియత్యద్భుతమునొందుచు నెల్ల వేడుకలుచేయుచుండెను.

ఇటులనుండగా కొన్నిదినములకు నాయసత్యవేణి గర్భమునుధరియించి నవమాసములునిండి యొకపుత్రునింగనెను. ఆబాలునకుఁబ

ద్ధమనిపేరుపెట్టిరి. అంతనాయసత్యవేణిక్రమప్రకారము దబ్బర, యుళక్కి-మోహ, భ్రమయను నలువురుపుత్రులనుగనిన యారాజేంద్రుఁడు మిగులయుప్పొంగి యామైదుగురు పుత్రులతోనానందించుచు, నాద్వీపమున ముప్పదిసంవత్సరములు తనరాజ్యమందును బుత్ర, కళత్ర, బంధు, మిత్రామాత్య, భృత్యవర్గంబునందును జ్ఞప్తిలేక యుండుండు యద్భుతమైనవింతలనుజూచుటకేకాలముచాలక నేమియునుదోచకనొకనాఁడు భార్యనుంజూచి, ప్రియురాలా! నేనువచ్చినిన్నువివాహముచేసుకొనిముప్పదిసంవత్సరములాయెను, బిడ్డలకువిద్యాబుద్ధులేగఱపితినిగానివేటాడవలసినక్రమములుచెప్పనైతిని, రేపటిదినము బిడ్డలతోడ వేటకుంబోయెదనని చెప్పిన యాయసత్యవేణి నేనునుమీవేటవేడుక చూడవచ్చెదననిపలికి తయారుచేయించెను. ప్రభువునుబుత్రులును గుఱ్ఱములనెక్కి-రి, యసత్యవేణిపల్లకిలోఁగూర్చుండి వేటకత్తియలతోడనందరును యడవికింబోయిరి. హరిశ్చంద్రచక్రవర్తిబిడ్డలకు మృగములవేటనుం జెప్పుచు, దుష్టమృగములను బాణములతోఁబడఁగొట్టుచు, వినోదముగవేటలాడుచు, భార్యకుసంతోషమునుబుట్టించుచు, పంతములాడి మృగములను బట్టితెచ్చుచుఁ ద్రిమూర్తులనువేటకువచ్చినఁగాంచి వారికినమస్కరించి తానుబత్నీపుత్రులతోడవేటకువచ్చిన వర్తమానమునుజెప్పి వారిచేత దీవనలుగైకొని యాసాయంసమయమున పత్నీపుత్రులనువేటకత్తియలనువెంటఁబెట్టుకొని పురిలోనికివచ్చుచు, నాప్రదీచిదిక్కున దివ్యరత్నగోపురప్రాకారములును దివ్యభువనములునుగలిగి తళతళమెఱయుచుండిన గొప్పపట్టణమునుజూచియాశ్చర్యపడి భార్యకుంజూపించి ప్రియురాలా, ఆపట్టణమెయ్యది, ఎవ్వరుపాలించుచున్నారనియడిగెను. ఆయిందుముఖప్రాణనాథాయదియాశ్చర్యపట్టణమునాతండ్రి వంధ్యాసూనుఁడను మహేంద్రుఁడు దారుపురుషుఁడనుమంత్రితోఁ బాలించుచున్నాఁడు, అతని భార్యభ్రమాదేవియనుయుత్తమురాలిగర్భమున నాయక్కసత్యవేణియును, నేనును, నాచెల్లెలియుళక్కి-వేణియునుబుట్టితిమి. సత్యవేణియునునేనునుజ్ఞానాజ్ఞానభూములను బాలించుచున్నాము, ఉళక్కి-వేణి వివాహములేకయున్నది, ఏడేడుపదునాలుగులోకములకు నాతండ్రియేకర్త, అతనిమాయయేసర్వమున్ను త్రిమూర్తులుసహాసర్వదేవతలకు నతఁడేదేవ

కుముందుగాఁ దెలియఁ జేయక యింద్రజాలమెట్టులఁ జేసితివి,నామంత్రిస్వప్నమని వాదించుచున్నాఁడు,నేను నిజమని పలుకుచున్నాను,నీవు నీమహిమయని జెప్పుచున్నావు, మనముగ్గురిలో నెవ్వరు నిజము యెవ్వరబద్ధమని పలికిన యతఁడు దేవరవారి యిష్టప్రకారము మఱల నా విద్యావిశేషమును జూపించెదను మిగులఁ దృఢమైన చిత్తముతో నుండుఁడని చెప్పి యా మాయకుడు తన చేతిలోని నెవలి యీఁకల కుంచెను ద్రిప్పి చిత్తసంకల్పమును బొందించి మహేంద్రజాలమును గావించెను.

అంత నా రాజేంద్రునకు మఱల నిద్రమైకము కలిగి నేత్రములను మూసెను.ఆక్షణకాలమునకంతయు నా మండలాధిపతికిఁ గొప్ప వెలుగును యనేక యుద్యానవనములును దివ్యమంటపములును తాను గూర్చుండిన చోటున వరత్న వేదికగాను గనుపించిన యతడచ్చెరువంది చూచుచున దాటున నొక శ్వేతాశ్వమును జూచి యాశ్చర్యపడి ఆహా యిది మిగుల రమ్యముగా నున్నది ఇటువంటి శ్వేతాశ్వమును నేనిదివరకుఁ జూడలేదు, ఇది యేలోకమునుండి వచ్చెనో తెలియదు మహాత్ము లెవ్వరో నెక్కి సవారి చేసినట్టుల గంతయు మర్చియున్నది,ఇట్టి తురగము నెక్కని వాని జన్మ మెందుకని మిగులఁ దెంపుతో లేచి యా గుఱ్ఱము యొక్క కళ్లెమును బట్టుకొని దాని దేహమును దడవుచు దాని పై నెక్కి కూర్చుండెను. అంత నా మాయా తురగము భూమిమీఁద నిలువక యంబరవీధి కెగసి యతివేగముగా బోవుచుండెను. ఆ చక్రవర్తి గుఱ్ఱపు వేగమునకు భయపడక ధైర్యముతో నచ్చటచ్చటఁ దోఁచెడు వింతలను జూచుచు, నీతురగ మెక్కడికిఁ గొనిపోవునో యని మనంబున వితర్కించుచుం బోవుచుండెను. ఆయశ్వము బహుదూరము పోయి యందొక యుద్యానవనములోఁ నతనిం డించి చూచుచుండఁగా నేమటుమాయముగాఁ బోయెను

అంత నా రాజేంద్రుఁడు వివిధఫలకుసుమభరితంబులైన వృక్షలతలను జూచి యాశ్చర్యపడి,ఆహా యిట్టి ఫలవృక్షములను లతలను మన దేశమునఁ జూడలేదు,ఫలములు మిగుల మనోహరములై యున్నవి,రుచి యెట్టులుండునో చూతమని చూచి వాని మాధుర్యమునకు సంతసించుచు, నా ఫలములను గోసి భక్షించుచు,సుగంధతావి నాఘ్రాణించుచు,మలయమారుతమునకు నుప్పొంగుచుం బోయిపోయి యా వనమధ్యభాగమున సువర్ణరత్నఖచితంబైన విచిత్రమంటపమును దానికిం బూర్వదక్షిణంబున నం దష్టకోణము

లుకలిగి బంగరుపద్మములతోఁభాసిల్లుచుండెడుదివ్యమైనసరస్సును, దా నికిరుబడికళ్లుగాఁదాపించియుండిననవవిధరత్నములనుజూచిముక్కుమీఁ దవ్రేలుపెట్టుకొనివిస్మయమునొంది,ఆహాయిది దేవవనముగానుండుటకు సందియములేదనియోచించియందుండుపూపొదరిండ్లయందును, ఆమం టపమునందును, విశ్రమించుచు,నొకనాఁడాకొలనులోదిగిజలపానముచేసి పొగడచెట్టునీడక్రిందఁగూర్చుండిననానావిధములైన దేవవాద్యములనువిని ఆహా యీవింతవాద్యములెందుండివినవచ్చుచున్నవని నలుదిక్కులుపరి కించుచు, పిమ్మటగజ్జలధ్వనులనువిని యామండలాధిపతి యచ్చెరువంది స్త్రీలుయెవ్వరో నీకొలనిలో జలక్రీడలాడుటకువచ్చుచున్నారనియును, మనమిందుండిననవమానపడుతురనియునుయోచించి, యందొకబోదు రుచాటునడాఁగిచూచుచుండెను.

అంతటఁగొక్కరుమెఱుంగు తెఱంగుననొకకన్యకామణి తనదే హకాంతులష్టదిక్కులువ్యాపించునటుల,నూర్గురు చెలికత్తియలతోడ నా సరస్సునకువచ్చివస్త్రములనువిచ్చియొడ్డునంబెట్టిచెలికత్తియలుం దాను జలములోదిగిజలక్రీడలాడుచుండెను. హరిశ్చంద్రచక్రవర్తితనభార్యయ సత్యవేణియనియోచించి, యాలతాంగులునీరువెడలివచ్చివస్త్రములను ధరియించినపిమ్మట తానుమెల్లగాలేచిపోయియాపూఁబోడియెదుటనిలిచి ఓహో!ప్రాణనాయకీ నీవెటులప్రాణములనుదప్పించుకొంటివి బిడ్డలు యేమైపోయిరినేనునీభర్తయైనహరిశ్చంద్రచక్రవర్తినిగానా,నీకునాయం దుప్రేమలేకుండుటకుఁగారణమేమి, ఇందుముఖీనీవుయింతలోనేనన్ను మ ఱచితివాయనికౌగిలింపవచ్చెను.ఆకన్యకామణిచిఱునగవుతో వెనుకకుం బోయిపుణ్యాత్మానీకుఁగుర్తుతెలియకభ్రమచేతనీభార్యయనియెంచి పలు కుచున్నావు,అకటానేనుపెండ్లికానికన్నియనునాపేరుయుశక్తివేణి,నీభా ర్యకుంబేరెయ్యది,నీవృత్తాంతమంతయునెఱిగించుమనిన, యతఁడుచక్క గాచూచివ్రేలుకొరికికొనిఓహోనీమాటలునిజము,నేనుభ్రమచేత నా భార్యవనితలంచితిని, నాతప్పుక్షమింపుము, నాభార్యయసత్యవేణిమిగుల సుందరి,మహేంద్రునిపుత్రి,దానివలెనేనీవుప్రకాశించుటనుబట్టిత్వరప డిపలికితినినితనవర్తమానమంతయునెఱిగించి, నీవెవ్వరునీవర్తమానము నుజెప్పుమనిన, యాబిసరుహదళాక్షిపుణ్యాత్మానేనుమహేంద్రుఁడను దే

వృత్తమునిపుత్రినినాపేరుయుశక్తివేణియనిచెప్పెను.అతఁడుపక్కననగి మరదలా నేనునీయక్కయసత్యవేణిభర్తను,నీవునాకుమరదలవుతొల్లింటి బంధుత్వమునువిడువకనన్నునీవువివాహముచేసుకొనుమనిపలికి యసత్య వేణినిందలంచిదుఃఖించెను.ఆకన్యకామణియతనినూరడించి నీవుపురిలో నికివచ్చినాతండ్రిఁబ్రార్థించిన యతఁడువివాహముగావించుననిచెప్పి యాకన్నియతనమేడకుంబోయెను. అంతనారాజేంద్రుఁడు సమీపమం దుండినదివ్యపట్టణమునుగాంచియద్భుతమునొందుచునందుండునాశ్చ ర్యములకుత్తరపాటునొందుచు, నామహేంద్రునిసభకుంబోయియామ హాత్మునకునమస్కరించితనవర్తమానమును అసత్యవేణివర్తమానమును జెప్పిదుఃఖించి,మహాత్మా!త్రిలోకనాయకాదేవరవారిచిన్నపుత్రియైనయు శక్తివేణినిచ్చినాకువివాహముగావించుఁడనిప్రార్థించెను.ఆమహేంద్రుఁ డునీవుమిగులజాగ్రతగలవాఁడవు సత్యసంధుఁడవు నీయిష్టప్రకారము చే యుదుననిపలికి పురిశృంగారమునుగావించి త్రిమూర్తులను దేవగణము లనురావించి శుభముహూర్తంబున వివాహమహోత్సవముగావించె ను. ఆయుశక్తివేణిరాజేంద్రునియిష్టప్రకారముభోగించుచు భర్తనుత్రి మూర్తులపురములకును, ఇంద్రవరుణాది యష్టదిక్పతులపురములకు ను గొనిపోయి యందుండువింతలనుజూపించుచు, నవరత్నఖచితంబులైన కేళికాగృహములయందును,బూపొదరిండ్లయందును, సైకతభూముల యందును వివిధబంధములతోఁ బెనంగిప్రభువునుమహానందాబ్ధిలో వోలలాడించుచుండిన,యారాజేంద్రుఁడుతనరాజ్యమునుపత్నీపుత్రహి తబంధ్వామాత్యజనంబులను మఱచియిరువది సంవత్సరములుండెను. ఆ యింద్రజాలకునిమహిమవలన నొకనాడుజ్ఞప్తికివచ్చి మామగారికిం జెప్పి భార్యనుమువ్వురుచెలికత్తియలను దేవనాగమణులను వివిధవస్తువులను బుచ్చుకొనిదేవవిమానముమీఁదంగూర్చుండి తనపురికివచ్చి యందొక మంటపములోదిగి మంగళవాద్యములతో గృహప్రవేశముచేయుదమ నియోచించి పట్టపుటేనుఁగును ముత్యాలకుచ్చులపసిడి పల్లకినిశృంగా రించితెచ్చి పుణ్యస్త్రీలు మంగళవాద్యములతోడవచ్చి వెంటఁబెట్టుకొ నిపొండనియాజ్ఞాపించి భార్యనుంబల్లకిలోఁగూర్చుండఁబెట్టుకొని తాను యేనుఁగునెక్కి మేళతాళములతోఁ బోవుచు, నాయింద్రజాలకుని మ

హేమనలన నాజాలముయొక్క మైకమువదిలి నేత్రములను దెఱచి తాను నెక్కినయేనుఁగును, ముత్యాలకుచ్చులపసిడిపల్లకిని, ఉళక్కివేణిని, దాని చెలికత్తియలను, అంతఃపురస్త్రీలను గానకదిగ్భ్రమజెంది, తన మంత్రులనుప్రధాన సామంతరాజులనుజూచి, ఓహోమిత్రులారా నేనెక్కి వచ్చుచుండిన యేనుఁగుయెందుబోయెను, ఉళక్కివేణియును దానిచెలికత్తియలును నాచేతిలోని నాగమణియును యెందుబోయెనని యడిగెను. ఆ పెద్దమంత్రి రాజేంద్రా దేవరవారు నేత్రములను మూసికొని యెదునిమిషములాయెను, ఇంతలోనేమేమివింతలనుజూచితిరి, ఉళక్కివేణియెవ్వరు, జరిగినవర్తమానమంతయునుజెప్పుడనిప్రార్థించిన,యామండలాధిపతి సర్వమునెఱిగించిదుఃఖించెను. ఆయింద్రజాలకుఁడు రాజేంద్రామహేంద్రుఁడిచ్చిన వస్త్రాభరణములెక్కడ,సర్వమునామాయగానినిజముగా జరిగినదికాదు, స్వప్నముకాదు, నామహేంద్రజాలమనిచెప్పిన యారాజేంద్రుఁడు ముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని, యామహాత్ముని పెక్కువిధములవినుతించి యాలింగనముచేసుకొనిసువర్ణరత్నములతోఁబూజించి యతఁడుకోరినవస్తువులన్నియునిచ్చి పుచ్చెనని చెప్పెను. ఆరామచంద్రుఁడద్భుతము నొందిమునీంద్రాహరిశ్చంద్రచక్రవర్తి సత్యసంధుఁడని వినియున్నానేగానియనృతమాడినటుల నేనిదివరకునువినలేదు,మీవలనవింటిని, పుత్రునివిషయమైవరుణదేవునితోనెటులబొంకెను. ఇంద్రజాలకునివలనదెలియవచ్చియాపుణ్యాపురుషుడేమిచేసెను.అతనివృత్తాంతమంతయు నెఱిగించుడనివేడిన యాతపోధనుండిట్లనియె.

శ్రీరామచంద్రా హరిశ్చంద్రచక్రవర్తిపుత్రార్థియై వరుణదేవునింగూర్చితపంబుచేసిపుత్రునింబడసెను. ఆవరుణదేవుఁడుహరిశ్చంద్రునివాచాబద్ధమాడించుటకిది సమయమనిమనంబునయోచించిరాజేంద్రాపురుడుతీరగానేవచ్చెద, నాయిష్టమునుదీర్చెదవాయనియడిగెను. అతఁడుమంచిదనివాగ్దత్తముచేసెను. ఆవరుణదేవుఁడువచ్చిపుణ్యాత్మానీపుత్రునినాకుంబలిపెట్టుమనియడిగిన,యారాజేంద్రుఁడుతనమనంబునదుఃఖించికాపట్యమునుబొందియదిబయిటికిందోపింపజేయకమహాత్మా నీయిష్టమునుదీర్చుటకుసందియము లేదు,అకటాదంతములుమొలువనిశిశువునుబలిపెట్టుటయుత్తమముకాదనిప్రియములుపలికియంపెను.అంతనావరు



ణదేవుఁడుఁ గొన్నిమాసములుజరిగినపిమ్మటమఃఅలవచ్చియడిగినయారాజేంద్రుఁడైదుసంవత్సరములవరకు బిడ్డబ్రహ్మముతో సమానుఁడనిచెప్పియంపెను, అనంతరమావరుణదేవుఁడుసప్తమవర్షమునవచ్చిబలిపెట్టుమనియడిగిన, యారాజేంద్రుఁడుమహాత్మా పదునెనిమిదిసంవత్సరముల పర్యంతము బాలుడజ్ఞానుఁడనిచెప్పంబడును గాఁబట్టియవివేకునిం బలిపెట్టుటయుత్తమపక్షముకాదనిచెప్పెను.ఆవరుణదేవుడుసమ్మతించి తనలోకమునకుంబోయిఁబందొమ్మిదవసంవత్సరమునమగుడివచ్చిచక్రవర్తినింజూచిబలిపెట్టుమనియడిగెను.ఇంతలోనారాజేంద్రుఁడుపుత్రునకు విద్యాబుద్ధులుగఱపిభూమండలమంతయును సంచరించిరమ్మనియంపెనుగనుక,యావరుణదేవునకు నమస్కరించి తనబిడ్డ భూసంచారమునకుంబోయినవర్తమానమునుజెప్పియంపెనుగాఁబట్టి యిందువలనయాహరిశ్చంద్రునకుయనృతదోషముసంభవించెను, ఇంద్రజాలకునివలన తానసత్యమాడినటులఁదెలియవచ్చిమిగులసంకటమునుబొంది,తనమంత్రులనుసామంతరాజులనుసభికులనుముఖమెత్తిచూడకతలవంచుకొనిఖిన్నుఁడై మనంబునవిచారమునుబొందుచు,తనపెద్దమంత్రినింజూచిమిత్రుడానాకనృతదోషముసంభవించెను, అట్టిదురితమెటులఁబాపికొందును,రాజ్యమునువిడిచియడవికింబోయియుగ్రతపంబుచేసినిష్కల్మషుండనై మోక్షమునుబొందెదననిపలికివిరక్తిమార్గముతోనుండుటనుజూచిమంత్రిభయభ్రాంతుడై తక్షణమునాకుసమాచారమంపిన నేనతనియందుపుత్రవాత్సల్యతగలవాడనై వచ్చి యారాజేంద్రునినాదరించి,మంచివాక్యములతో బిడ్డానివేలదుఃఖించెదవునీకుజననమరణంబులును, సుఖదుఃఖంబులును,స్వర్గనరకంబులును,బంధమోక్షంబులును,బుణ్యపాపంబులునులేవు,నీనిజస్వరూపమును దెలియజాలక భ్రమస్వరూపమైన మూలములేనియీమాయాశరీరమునీవనిభావించి, లేనిదుఃఖమునుబొందుచున్నావేగాని, నీనిజస్వరూపమేమియునులేని, యెద్దియునుగాని యచలపరిపూర్ణమైయెందునుస్వతస్సిద్ధముగానున్నది. మదించినగంధనాగము తనపైనమన్ను దానే వేసుకొనునటులలేనిదుఃఖమును నీవేలఁబొందెదవు, అచలపరిపూర్ణబ్రహ్మమువలనఁబుట్టనిదే యీమాయయెఱుక, అదితలిదండ్రులులేక తనంతటతానేవచ్చి భ్రమరూపకమై భ్రమింపజేయుచుండును, భ్రమయేమె

ఒక, భ్రమయేమాయ, భ్రమయేమహేంద్రుఁడు, భ్రమయేనారాయణుఁడు, భ్రమయేసదాశివుఁడు, భ్రమయేకల్పనాసహితములైనమోక్షాదిపదవులు; భ్రమయేముక్తికాంత, నీకుయింద్రజాలమందుదోఁచిన యసత్యవేణిమొదలగుసర్వమును భ్రమరూపకములేగానిస్థిరములుకావు, ఈప్రపంచమునట్టిదేయని పెక్కువిధములఁబోధించియతని నిజస్వరూపమునుసాక్షచేసి, కలలోవచ్చినశరీరముమేల్కనినయేమిలేదనిచెప్పి యతనిభ్రమనుదొలఁగించియశరీరునిగావించి మఱలరాజ్యముననిలిపితినని చెప్పెను. ఆ రామచంద్రుఁడడద్భుతమునొంది, స్వామీ, మునీంద్రా! మీవాక్యములుమిగులయాశ్చర్యకరములుగానున్నవి, 'అయమాత్మాబ్రహ్మ' యనియును "ప్రజ్ఞానంబ్రహ్మ" యనియును "అహంబ్రహ్మాస్మి" యనియును, "తత్వమసి" యనియును, సచ్చిదానందమనియును, నాదబిందుకళలనియును, భక్తివైరాగ్యయోగజ్ఞానములేముఖ్యములనియును, మోక్షాదిపదవులేయనుభవములనియును వేదములుపలుకుచున్నవి, వేదాంతులైన మహాఋషులుభక్తియోగజ్ఞానములేవిశేషములనియును వేదములే ప్రమాణములనియును జెప్పిరి, దేవరవారుసెలవిచ్చినమార్గము దానికివిరుద్ధముగానున్నదని పలికెను. ఆమునీంద్రుఁడుచిఱునగవుతోనతనినాలింగనముచేసికొని, బిడ్డా! నేనుజెప్పినయచలమార్గమునుభక్తివైరాగ్యయోగజ్ఞానులును. శ్రుతులును స్మృతులును, శాస్త్రములునుదెలియఁజాలవు, వేదములంతమునొందుటచేతనేవేదాంతమనిప్రసిద్ధంబయ్యెఁగావున వేదాంతమైన యచలమార్గమునువేదములెట్లెఱుంగును, వేదప్రమాణులైన భక్తియోగజ్ఞానులు వేదాంతమెటులఁదెలియుదురు, వేదములంతమునొందినపిమ్మట వేదములతోఁబనియేమి, వేదాంతమునుగనజాలకనే, మాయావాదులైనభక్తియోగజ్ఞానులుసిగ్గులేకమేమువేదాంతులమనియును, మాకువేదములేప్రమాణములనియును. అహంకారముతోవదించుచున్నారు, వేదములుమాయయొఱుకకేప్రమాణములుగానియచలపరిపూర్ణబ్రహ్మమునకుఁ బ్రమాణములుగావు. వేదములు, యొఱుకయేయాత్మయనియును, ఆత్మయేయొఱుకయనియును, యొఱుకయేపరబ్రహ్మమనియును, యొఱుకయేబ్రహ్మమనియును, యొఱుకయేనారాయణుండనియును, యొఱుకయేసదాశివుండనియును ఆత్మయేబ్రహ్మమనియును, ఆత్మశరీరమునకువేరనియునుజెప్పుచున్నవి. ఆ

రుచున్నది,నలచక్రవర్తిదినములలోనాయింద్రజాలకులువచ్చిగావించిన వినోదములంతయును జెప్పుమనిప్రార్థించినయామునీంద్రుండిట్లనియె.

మొ ద టి క థ ము గి సె ను.

---

## —*(న ల చ క్ర వ ర్తి క థ.)*—



నలచక్రవర్తి. ఇంద్రజాలకుఁడు. ప్రధానసామంతరాజులు. మంత్రులు.

శ్రీరామచంద్రావనుము తొల్లి నలచక్రవర్తి నవఖండమండలాధిపతియై భూమండలమంతయును బాలించుచు నొకనాడు అంగ, వంగ, కళింగ, బంగాళ, ఘూర్జర, సౌరాష్ట్ర, కాశ్మీరపతులును అష్టమంత్రులును, విద్వజ్జనంబులును, ఆర్యులును, దన్ను బరివేష్టించియుండఁగా నిండుకొలువుకూటంబునం గూర్చుండెను.

ఆసభకు పద్మనాభుండను యింద్రజాలకుఁడువచ్చి జాలమునుగావించి ప్రభువునుం జూచి రాజేంద్రా, నేనుబీదబ్రాహ్మణుండను నాపేరుపద్మనాభుఁడు, వేదాంతప్రవర్తకుండను, నాయందువైదీకము మెండుగాగలదు, నాకిప్పుడుసంభవించినదుఃఖమునువిని నన్నాదరించి కాపాడవలయును, నాభార్యవిమలాంగియనుసుందరీమణిని మత్స్యదేశమునుండి వెంటఁబెట్టుకొనివచ్చుచు మొన్నటిరేయియడవిలోని వటవృక్షముక్రిందంబరుండి నిద్రించితిమి, సూర్యోదయమున నిద్రలేచిచూడఁగా నాభార్యలేకపోయెను, నాకుభయమును శరీరకంపమునుగలిగి తడబడుచు నోటతడిలేక యాసమీపమందుండిన మిట్టపల్లములంబొదలం దిరిగిచూచిచూచి యెందునుగనుపించనందున గొప్పకంఠధ్వనితో బిలుచుచు, కుయ్యోమొఱ్ఱోయని పేరెలుంగున నేడ్చుచు, నాసాయంసమయమువరకు నాచుట్టు ప్రక్కలవెదికి యెందునుంగానక రోదనశబ్దములను జేయుచువచ్చితిని, అకటా యట్టిదివ్యసుందరియును, పతివ్రతాశిరోమణియునునైనభార్యను విడిచి నేనెటులజీవించియుందును, అట్టికులాంగనను మోసపుచ్చి యెవరుదోచ్కొనిపోయిరో, లేక మృగములచేతంజచ్చెనో, లేకనన్నుంగనజాలకయడవియందే దిరుగుచు నేడ్చుచుండెనో, నేనేమి చేయువాడను, మీకంటెను నాకు దిక్కెవ్వరు, నన్ను రక్షించుభారము నీదియనిన యారాజేంద్రుఁడా బ్రాహ్మణుని యాదరించి మహాత్మా నీవు విచారపడవలదు, నీభార్య ప్రాణసహితయై యెందుండిననురప్పించి నీకిచ్చెదనని వాగ్దత్తము చేసి, చిత్రలేఖరులను బిలిపించి యాబ్రాహ్మణుఁడు చెప్పిన గుర్తులప్రకారము పటములను వ్రాయించి, తనదూతలయొద్దనిచ్చి మీరు నలుదిక్కులకుంబోయి యడవులు, కొండలు, బిలములు, పట్టణములు, గ్రామములు దిరిగి యీగుర్తులప్రకారమా బ్రాహ్మణినింగనిపట్టి దోడ్కొనిరండు పొండని వుత్తరువిచ్చెను.

అంతనాయింద్రజాలకుఁడు ప్రభువునుంగాంచి పుణ్యాత్మా భార్యావి

యోగమెటులభరింతును,దానిరూపమునాకన్నులకుంబొడగట్టుచున్నది
నేనునుబోయివెదికివచ్చెదను, ఇంతలోపల నాభార్యవచ్చినయెడలదా
నినెందునుంబోనివ్వక భద్రపరచిదేవరవారివాగ్దత్తమును నెరవేర్చుకొ
నుడనిచెప్పిపోయెను. అంతంగొంతసేపటికి కొందఱుభటులు పరుగునవ
చ్చి యాప్రభువునకునమస్కరించి దేవరవారియాజ్ఞప్రకారము మేము
యుత్తరపుదిక్కునకుంబోయివెదకుచు నందొకచెట్టుక్రిందంగూర్చుండి
యేడ్చుచుండినయాబ్రాహ్మణినింగాంచి యాసటములోనిగుర్తులన్నింటి
నింబరిశీలించి యాబ్రాహ్మణునిభార్యయనితెలుసుకొని యామెవర్తమా
నమునువిచారించి, యమ్మానిన్నునీభర్తకునొప్పగించునటుల మండలా
ధిపతివాగ్దత్తముచేసెను, మాయదృష్టమువలన మేముసమీపములోనే
నిన్నుబొడగంటిమి, పురిలోనికిరమ్మనిమేమెంతసేపుప్రార్థించిబిలిచినను,
ఆయిందుముఖవచ్చుటలేదనియును,బ్రొద్దుగ్రుంకులోపలతనభర్తరాకుం
డిన తానగ్నిలోప్రవేశింతుననియును బలుకుచున్నది, మాలోగొందఱ
చటనేయున్నారు, మేముపరుగునవచ్చితిమనిచెప్పిరి. ఆరాజేంద్రుండుస
భికులనుజూచి మిత్రులారా నేనాబ్రాహ్మణునకువాగ్దత్తముచేసియుంటిని
ఆబ్రాహ్మణుండెచటవెదుకంబోయెనో తెలియదు,ప్రొద్దుగ్రుంకు లోప
ల తనభర్తరాకుండిన తానగ్నిలోంబ్రవేశించునట, మనమిందుకేమిచే
యుదము, ఏమికీడుసంభవించునో తెలియదు. ఇదియద్భుతపుకార్యము
గానున్నది, మనమేపోయియాలతాంగినిందోడ్కొనివత్తము, లేకుండి
నయనృతదోషముసంభవించునని యోచించి,యాచక్రవర్తిత్వరితముగ
మంత్రులను,ప్రధానసామంతరాజులను,విద్వజ్జనంబులను, పరిచారకుల
నువెంటంబెట్టుకొనియాస్థలమునకుంబోయి యామెసుందరమునకునాశ్చ
ర్యపడి యమ్మానేనునలచక్రవర్తిని, నిన్నునీభర్తకునొప్పగించునటులవా
గ్దత్తముచేసియున్నాను, బ్రాహ్మణవిశ్వాసపరుండను, పరస్త్రీలనుబిడ్డలు
గాభావింతును, నీవుసంశయింపకనీతండ్రితోభాషించునటుల నాతోభా
షించి నీవర్తమానమంతయునుజెప్పిపురిలోనికిరమ్ము, నీభర్తనిన్ను వెదు
కుటకై మగుడియడవికింబోయెను, మాపోలేకరేపోవచ్చును,అంతవరకు
పురిలోనికివచ్చియుండుమనెను. ఆకంజదళాక్షికన్నుల నీళ్లుదుడిచికొను
చు ముఖమెత్తి ప్రభువునుంజూచి పుణ్యాత్మా "బుద్ధిఃకర్మానుసారిణీ" అ

నుబలుకుప్రమాణముతప్పక నాకిట్టిదుఃఖముసంప్రాప్తమాయెను, నన్ను నాతలిదండ్రులు మిగులప్రేమతోఁ బెనుచుచుధనవంతులను రూపవంతులనుగోరుమని పెక్కువిధములప్రేరేపించిచెప్పినను నేనువినక వేదాంతప్రవర్తకుండునుగుణవంతుండునుదరిద్రుండునునైనభర్తనుంగోరి వివాహముచేసుకొని మిగుల కష్టములనుభవించితిని, మొన్నటిదినముప్రాతఃకాలముననిదురలేచిజలమలబాధలుదీర్చుకొనుటకై యోచించి భర్తకు నిద్రభంగముగావించుట పాపమనితలంచి, జలాశయమునకుంబోయిజలమలబాధలఁదీర్చుకొని పరిశుద్ధురాలనై వచ్చిచూడగా నాభర్తయచట లేనందునదిగులుపడి యెందుఁబోయెనో లేకమృగములవాతంబడెనో యనివెదుకుచుదిక్కులేనిపక్షివలెనల్లాడుచు, రోదనశబ్దములను జేయుచు,నిద్రాహారములులేకవటించుచు,నీవృక్షముక్రిందంగూర్చుండిదుఃఖించుచున్నాను, నేటిదినముప్రొద్దుగ్రుంకులోపల నాభర్తరాకుండిననేనగ్నిలోఁబడుటకుయత్నించియున్నాను, నేనుబురిలోనికిరాను, సుఖములనొల్లను, పుణ్యాత్మానన్నుబిలువవద్దు పొండనిపలికిన యామండలాధిపతి యమ్మా! ఆబ్రాహ్మణునియందులేశమైననుదప్పులేదు, నిన్నుగానకతఁడును, అతనింగానకనీవును దుఃఖములనుబొందితిరేగాని యెవరియెందును దోషములేదుమీాసంకటములునేటితోనివర్తించెను,ఇఁకమీాదుమేలుకలుగుటకుసందియములేదు,నీకు సారెలు,చీరలు,మాడలు,సొమ్ములు,నీవు కోరినటులిచ్చి నీభర్తవెంటఁబ్రయాణముచేసియంపెదను, నామాటసత్యముగానెంచి నీభర్తవచ్చునంతవరకునీవుపురిలోనికివచ్చియుండుము, లేనియెడల నీభర్తవచ్చునంతవరకుఁబ్రాణములనునిలుపుకొని యుండుమనిపలికిన, యాతలోదరిరాజేంద్రా! సూర్యచంద్రులకుగతులుదప్పినను, ఆకసముభూమిమీాదంబడినను, భూమిదిగ్గిరందిరిగి పాతాళమునకంటినను, నేనునాప్రతిజ్ఞచెల్లించకవిడువననిపలికిన, యామండలాధిపతికిభయమును, దొట్రుపాటును, దేహకంపమునుగలిగి యోపతివ్రతారత్నమా! నీవునాప్రాణములను గాపాడవలయును,నిన్నునీభర్తకునొప్పగించునటులయాబ్రాహ్మణునకువాగ్దత్తముచేసియున్నాను, అదినీవుతప్పించుటచేతనాకుప్రాణాంతమవును. దీర్ఘాలోచనచేయుమని ప్రార్థించెను.

అంతటమింటియందుకూతలార్భాటములును, సింహనాదములు

ను, గర్జింపులును,వీరాలాపములును, ధనుష్టంకారములును, విశేషము
గాగల్గి, దిక్కులుప్రతిధ్వనులిచ్చునటులవినవచ్చిన యారాజేంద్రుఁడు
తనసభికులనుజూచి. మిత్రులారా మింటియందు దేవదానవులకు యుద్ధ
ముసంభవించినట్టులున్నది, మనశిరస్సులకుఁబైగానేయున్నటులున్నది.
అందువలన మనకేమియుపాధిసంభవించునో మనమందరము చెట్లమ
రుగునయుందమనిచెప్పెను, ఆసభికులును,సరేయని యందరుఛత్రము
లనుబట్టుకొని చెట్లమరుగుననిలిచిచూచుచుండిరి. అంతట మహామేఘ
ములుగర్జిల్లునటుల, యొకరితోనొకరు తర్జనభర్జనాదులనుజేయుచు, రు
ధిరములనుదొరిగించుటను, తునిసిపడెడుకాలుసేతులను, ప్రేవులుప్రేలా
డుచుంబడెడువికృతములైనగాత్రములను, బండ్లుగొఱుకుచుంబడెడుశిర
స్సులనుజూచి యారాజేంద్రునకును, సభికులకునునోటతడిలేక చిత్రించి
నప్రతిమలవలె నిలిచియుండఁగానాబ్రాహ్మణియాగాత్రములలో తనపు
రుషునిశరీరమును, ఆశిరస్సులలోతనభర్తశిరస్సునుదెచ్చియాప్రభువున
కుంజూపించిరాజేంద్రా, నాభర్తనిజముగావచ్చునని చెప్పితిరే, దురాత్ము
లెవ్వరోనాప్రాణనాథుని రెండుతుండెములుగాఖండించిభూమిమీదంబ
డవైచిరి, ఇట్టియన్యాయమెందైననుగలదా, నేనేమిచేయుదానను, ఈ
ఘోరకృత్యమును జూచియెటులసహింతును, భర్తవియోగమెటులభ
రింతునని భూమిమీదంబడిఘోరముగావిలపించుచుండెను, ఆమండలా
ధిపతియును, సభికులును, ఆబ్రాహ్మణునిశిరస్సును, శరీరమునుజక్కగాఁ
జూచిగుర్తుపట్టి. అకటాయీయకృత్యమెవ్వరుచేసిరి, ఇదియేమియన్యా
యము, ఇందుకుమనమేమిచేయవచ్చునని మనంబునయోచించిచింతిం
చుచుండగా, నాబ్రాహ్మణిలేచినేనొకనిమిషమైననీదుఃఖమునుభరింపజా
లను, భర్తతోడసహగమనమయ్యెదననిపలికి, యాచెట్లక్రింది యాకుల
ను, సమిధలను,బోగుచేసియగ్నిదేవునింబ్రార్థించి, యగ్నిదరికొలిపిపురు
షశరీరమునుశిరస్సునుయాఅగ్నిలోబడవైచివలదువలదనిప్రభువుమొలు
గెత్తిచెప్పిననువినకయామాయలాడియాయగ్నిలోఁబడిభస్మమాయెను.

అంతనాసభికులందరు ప్రభువునుంజూచిదేవరవారికి. విపత్తుతొ
లగెను, ఆయిరువురునశించుటచేత మనకుమేలుగలిగెను, పురిలోనికిం
బోదమురండనిపలుకుచుండగా, నాబ్రాహ్మణుఁడు పరుగునవచ్చిప్రభువు

మెదుటనిలిచిరాజేంద్రా నేనుబద్మనాభుండను బీదబ్రాహ్మణుఁడను; నా భార్యయూరిబైటయున్నదనియును దానిందోడ్కొనివచ్చుటకై ప్రభువు సభికులతోడంబోయిరనియును భటులుచెప్పగావినిపరమానందముతో డపరుగునవచ్చితిని, ఆబ్రాహ్మణియెందున్నది. ఆహా నేనుజూచి యానందింతుననిపలికెను, ఆమండలాధిపతియునుసభికులును యాబ్రాహ్మణునిఁ జక్కఁగాఁజూచి గుండెలుఝల్లనిభయాశ్చర్యములుగలవారలై నోటమాటరాకనివ్వెరపాటుతో నిలిచియుండినంజూచి,యాంబ్రాహ్మణుఁడుదుఃఖావేశముతో రాజేంద్రా, దేవరవారునాతోభాషించక,నామాటకుబదులు చెప్పక, దిగులుపడియుండుటకుకారణమేమి,నాముద్దులభార్యయెందున్నది,త్వరితముగఁజెప్పకుండిన నాప్రాణములునిలువవు, దుఃఖముపొర్లి పొర్లి వచ్చుచున్నదనిపలికిన,నతఁడుతనదుఃఖమడఁచికొనిజరిగినవర్తమానమంతయువినుపించిన, యాబ్రాహ్మణుఁడు రౌద్రాకారుండై పండ్లుపెటపెటంగొఱుకుచుతనచేతిలోని నెవలియూకలకుంచెను భూమిమీదంబడవైచి ఓహోయిట్టియన్యాయమెందైననుగలదా, దేవదానవులకుమింటియందుదారుణమైనయుద్ధముగలుగుచెట్లు, ఆహాయిదివింతకార్యముగానున్నది,మానవుండనైననాకళేబరమును,శిరస్సును,దేవదానవులగాత్రశిరములతోడ భూమిమీదంబడుటకుఁగారణమేమనియును, మానవుండెటుల మింటికింబోయెననియును, బిడ్డలకు సహితము తెలియవచ్చునే, ఇట్టియన్యాయముమీకెందుకుఁదెలియఁబడకుండెను, ఆహా మీమాటలుమిగులఁజిత్రములు నేనెటులనమ్ముదును,బొంకిననుజక్కఁగాబొంకవలయునేగానియిటులబొంకంగూడునా, నిన్నుపరస్త్రీపరధనాపేక్షలులేనిసత్యవంతుడవనినమ్మితిని, అకటాగౌతమమునిభార్యనుదేవేంద్రుఁడును, గురుపత్నినిఁజంద్రుఁడును వ్రతభంగముగావించినటుల, మిగులరూపసియైననాభార్యను నీవువ్రతభంగముగావించియు నంతటితోఁదృప్తిపొందక దానినిపిడువంజాలక, రహస్యప్రదేశములో దాచియగ్నిలోఁబడి భస్మమాయెననియబద్ధమాడుచున్నావుగాని నిజమైనవర్తమానముకాదు, చిత్తవ్యాప్తి వలనదోషమేకాని శరీరవ్యాప్తివలనదోషముకలుగనేరదు, ఇంతటనైననాధర్మపత్నినంపినయెడల దానియందుదోషమెంచకనిన్నుదీవించినాదేశమునకుంగొనిపోవుటకుసిద్ధపడియున్నాను, నీవునన్నుమోసపుచ్చుట

న్యాయముకాదు నాదుఃఖమెవరితోఁ జెప్పుకొందును, అర్ధరాత్రివేళ పరమపతివ్రతయును బుణ్యురాలునైన నీభార్యను యడవులపాలుగావించి యహ్లాదఁబెట్టిన దుర్నీతిపరుండవని తెలిసియును, బుద్ధిహీనతచేత నిన్ను నమ్మిపోయినందుకుంతగిన ప్రాయశ్చిత్తమును గావించితివనిపలికి పొర్లి పొర్లి యేడ్చుచుండెను, ఆచక్రవర్తియునుసభికులును నేమియుంబలుక నేరకుండిరి, అంతనాయింద్రజాలకుఁడు లేచిప్రభువునుంజూచి పుణ్యాత్మా దేవరవారుబదులుమాట చెప్పకుండుటకుఁ గారణమేమనిన, నతఁడు బ్రాహ్మణోత్తమా నేనుజెప్పినదంతయునిజము లేశమైననబద్ధముండనేరదు, నీకోపమునకు వెఱచుచున్నాను, శాంతమునుబొందుము, నాపురిలో నీకిష్టమైన కన్నియనువివాహముగావింతును, సువర్ణరత్నభూషణములను, మోయునంతధనమును, అగ్రహారములను వేయిధేనువులనునిత్తుననిపలికిన, యాయింద్రజాలకుఁడు రాజేంద్రా నాకువివాహమువలదు, సత్యసంధుండవు సుధర్మాత్ముండవును బ్రాహ్మణవిశ్వాసపరుండవును, మండలాధిపతియును నైననిన్ను దుఃఖావేశముతో దుష్టవచనములాడితిని, నాతప్పుక్షమించవలెను, అగ్నిదేవుఁడునాకుమిత్రుఁడుగానుండియును నాభార్యనెటులభస్మముగావించెను, అకటా యతనికిం దెలియక నడిచినకార్యముగానుండును, నాకా యగ్నిగుండమునుజూపుడని యచటికింబోయి సర్వభక్షకుండవైన యగ్నిభట్టారకా, నేనుబద్ధనాభుండనుపేరుగల నీమిత్రుండను, పరమపతివ్రతమైననాభార్యనుం దెలియక దహించినాడవు, ఈమండలాధిపతియైన నలచక్రవర్తిసత్యసంధుఁడయ్యె నేని నీవునాభార్యను బునర్జీవితురాలుగాఁజేయుమనియగ్నిసూక్తములతో నతనిం బ్రార్థించెను. ఆరాజేంద్రుఁడును, సభికులునీబ్రాహ్మణుఁడు వెఱ్ఱివాడుగానున్నాఁడు, వైదికబ్రాహ్మణునకు వేపకాయంత వెఱ్ఱియుండునన్నసామెత నిజముగానేయున్నదని యొకరితో నొకరుచెప్పుకొనుచు నాయగ్నిగుండమును జూచుచుండిరి. అంత నామాయలాడి సంపూర్ణచంద్రికవలె నాయగ్నిగుండములోనుండి బైటవచ్చినం గాంచి, యామండలాధిపతియును సభికులునుముక్కులమీఁద వ్రేళ్లు పెట్టుకొని. ఆహా యితఁడు సామాన్యుఁడుగాడు దేవోత్తముండని పెక్కువిధముల బ్రాహ్మణునింగీర్తించి నమస్కరించిరి.

అంతనాయింద్రజాలకుఁడు ప్రభువును సభికులను దీవించి పుణ్యా

త్తులారానేనింద్రజాలకుండనునావిద్యావిశేషమునుజూపితిని, ఈబ్రాహ్మణిమూలమాయ,తపోనిష్ఠుఁడనైననాకు భార్యయెందుకు, మింటియందు కలిగినయుద్ధమును, భూమిమీఁదంబడినరుధిరమాంసాస్థిహస్తములును, తలలును, అగ్నిగుండమును,బ్రాహ్మణియును,సర్వమునామాయవలననిూకన్నులకట్లుదోచెననిచెప్పెను. ఆరాజేంద్రుఁడును సభికులునుయద్భుతమునొంది,యాబ్రాహ్మణియునుయుద్ధభూమిసహాసర్వమునుగానరానందునవిస్మయమునొంది, ఓహోయామనమెన్నడిట్టిజాలమునుజూచి యెఱుంగమనియావిప్రునింగొనియాడి పురిలోనికివెంటఁబెట్టుకొనిపోయి యతనికివిందులుగావించుచుండెననిచెప్పిన, యారామచంద్రుఁడు ముఖవికాసముతోమునీంద్రునింజూచిపావనచరితా, నలచక్రవర్తి యీజాలముతో నేతృప్తిపొందెనా,లేకమగుడిదానింబరీక్షించెనా నెఱిఁగించవేయనియడిగినయావసిష్ఠమహాఋషి శ్రీరామచంద్రా, సత్యముజనవిరోధమనియును,అసత్యముజనరంజకమనియును బలుకుశృతివాక్యములుదబ్బరగునా, సత్యమనునదిమిగులఁజేదు, ముష్టికాయవంటిది,లేశమైనసుఖములేదు,సుఖములేదు,ఆనందములేదు, పంచలోహములును నవరత్నములునులేవు, కాఁబట్టియదిజనులకువిరోధము,ఇదియేయచలపరిపూర్ణబ్రహ్మము, ఇదియేలోకవిరుద్ధము, అసత్యమనునదిమిగులరుచ్యముమధురమువిశేషము, పంచలోహములును నవరత్నములునుగలిగియుండును, మిగులసుఖానందమునుబొందించును గాఁబట్టియదిజనులకురంజకము,ఇదేమెఱుక, ఇదియేభ్రమపూవకమైనమాయ, ఇంద్రజాలముస్వప్నమువంటిది,ఇట్టివినోదమైనయింద్రజాలమును మగుడిదర్శించక, నలచక్రవర్తియేల విడుచును, ఆరాజేంద్రుడామరునాడు కొలువుకూటమునంగూర్చుండియాయింద్రజాలకునింజూచిమహాత్మా నీవిద్యావినోదమును జూపుమనినయతఁడు ప్రభువునుంగాంచి రేవరపాఁదికినిమెదుగుమంత్రులకును, యాద్గురుసామంతరాజులకునుమహేంద్రజాలమునుగావించెదను,మీరుపన్నిద్దరుజాగ్రతగానుండుఁడనిపలికి తనహస్తమందుండినవెవలియాకలకుంచెమునారిచుట్టునుద్రిప్పి చిత్తసంకల్పమునుబొందించెను.

ఆవెంటనేప్రభువునకును మంత్రులకును సామంత రాజులకును, నిద్రమైకముకలిగి నేత్రములనుమూసి,సువర్ణరత్నఖచితమైననొకమంట

పమునుజూచియాశ్చర్యపడి యామంటపములోనికింబోయి యందుండు వింతలనుజూచియచ్చెరువంది, యాసమీపమునందిరుగుచుండిన శ్వేత గజమును శ్వేతాశ్వములనుజూచి మనకుసమముగానేవాహనములు వచ్చియున్నవి. జీనికళ్లెములుమొదలైనవి యమర్చియున్నవి యెక్కుడని చెప్పి రాజేంద్రుఁడు యేనుఁగునెక్కెను, సభికులందరు నశ్వములనెక్కిరి, అంతనావాహనములువారినియతివేగముగాఁగొనిపోయియందొకరమ్యమైనవన సమీపమునడించి మఱుమాయముగాఁబోయెను, చక్రవర్తియును సభికులునాశ్చర్యపడి యాశృంగారవనములోనికింబోయి యందువివిధకుసుమఫలభరితంబులై మనోహరములై యొప్పుచుండిన వృక్షలతాదులనుజూచి నానిసుగంధతావి నాఘ్రాణించుచు, మాధుర్యఫలములనుగోసిభక్షించుచు, నావనమధ్యభాగముననవరత్నసోపానములతోనొప్పుచుండెడు దివ్యమైన సరస్సునుజూచి యద్భుతమునొందియాసరస్సులోదిగి జలపానముచేసి. ఆహా యిదియెవరివనమో, ఇదియేలోకమోనని యొకరితోనొకరుసంభాషించుచు నావనమునకుంబూర్వభాగమున నేత్రములకుమిఱుమిట్లుకొలిపెడు దివ్యమేడనుంగాంచి, దానియొద్దకుంబోయి యెందునుద్వారమును గనిపట్టజాలక విస్మయమునొంది ఆహా యిట్టిమేడను మనమెన్నడును జూచియెఱుంగము, మనభాగ్యవశమున నేడీవింత మేడనుజూడగంటిమి, దీనిలోపలయెవరుందురో తెలియదు దీనికిద్వారమెందునుగనుపించలేదని యాలోచించుచుండఁగా, నచటికొకపురుషుఁడువచ్చియాచక్రవర్తికినమస్కరించి, పుణ్యాత్మా! దేవదేవుండగుమహేంద్రునిపుత్రియైన త్రిలోకమోహినియను, కన్యకారత్నము త్రిమూర్తులను ఇంద్రాదిదేవతలనుగోరక భూలోకచక్రవర్తియైననలమహారాజునుంగోరుటచేత,నామహేంద్రుఁడుద్వారములేనియీమేడలో తనపుత్రినుంచెను, ఆకన్యకామణికిని దానిచేడియలకును క్షుత్పిపాసలు లేవు ముదిమిలేదు, ప్రొద్దుగ్రుంకినపిదప తెల్లవారుపర్యంతముదివ్యవాద్యములనుజేయుచు, శ్రోత్రములకానందముగాబాడుచుండును,త్రిమూర్తులును ఇంద్రాదిదేవతలునువచ్చి వినుచుందురనిచెప్పిపోయెను.

ఆనలచక్రవర్తి తనసభికులనుజూచి మిత్రులారా! మీరీవింత సమాచారమును వింటిరిగదాయని చెప్పి యానందించుచుండగా ప్రొద్దు

గ్రుంకెను, ఆమేడలోనుండి దివ్యవాద్యములరవములును మనోహరము లైనపాటలునువినవచ్చిన యతడునుసభికులునుయానందముగావినుచుండిరి, అంతనామేడయొద్దకుం ద్రిమూర్తులు వారిభార్యలతోడను, అష్టదిక్పతులు వారిపత్నులతోడనువచ్చిశ్రోత్రానందముగవినియానందించి నలచక్రవర్తియొక్క భాగ్యమేభాగ్యమని యతనింగీర్తించి వారివారి లోకములకుంబోయిరి, తెల్లవారినపిమ్మట యామహేంద్రుండు చతురంగబలంబులతోడను, మంగళవాద్యములతోడనుయామేడకువచ్చి, భూలోకచక్రవర్తిని యతనిసభికులనుదీవించి, యామేడకు ద్వారమునుగావించి పుత్రికారత్నమా నీవుకోరినయానలచక్రవర్తివచ్చెను, నీవుబైటవచ్చిచూడుమనిఁబిలిచిన,యాత్రిలోకమోహిని తనదేహకాంతు లనేకసూర్యచంద్రులపగిది ప్రకాశించునటుల నేత్రములకుమిఱుమిట్లుగొలుపుచు, నుత్సాహముతోబైటవచ్చినంజూచి భయభ్రాంతులై నేత్రములనుమూసికొనినిశ్చేష్టితులైనిలిచినయాచక్రవర్తినిసభికులనుజూచి యాయిందుముఖి యారాజేంద్రునిముఖమునందు పన్నీరుచల్లి కంఠమునపుష్పహారమును ధరింపజేసెను, దానిచెలికత్తియలు సభికులముఖములందుపన్నీరుచల్లిపుష్పమాలెలనుధరింపఁజేసివారివారివిమానములమీదంగూర్చుండఁబెట్టుకొనిరి, మహేంద్రుండువారినందరిని మంగళవాద్యములతోడం బురిలోనికివెంటఁబెట్టుకొనిపోయి త్రిమూర్తులనుయింద్రాదిదేవతలను సప్తమహాఋషులనురావించి ముహూర్తము నిశ్చయించి పురిశృంగారమునుగావించి శుభదినంబునవివాహమహోత్సవములు గావించెను, ఆత్రిలోకమోహిని తనభర్తను వివిధలోకములకుంగొనిపోయి పూపొదరిండ్లయందును, సైకతభూములయందును, కేళికాగృహములయందును,సుఖింపఁజేయుచునెల్లవినోదములనుజూపించియద్భుతమునొందించుచుండెను. ఆచెలికత్తియలును దమభర్తలనుసుఖింపఁజేయుచు నానందాబ్ధిలోవాలలాడించుచుండిరి. ఆసభికులొకనాఁడుప్రభువునుంగాంచి రాజేంద్రా! మనమీలోకమునకువచ్చి యిరువదిసంవత్సరములాయెను, మనకేమియునుదోచబడకమిగులసుఖానందముతోనుంటిమి, ఇంతటనైన మనలోకమునకుంబోకుండిన లోకులచేతనిందింపఁబడుదుమనిపలికిన,యాచక్రవర్తియాశ్చర్యపడి, అబ్బాయిరువదిసంవత్సర

ములాయెనా, మహదానందముతో నుంటిమి, భూలోకమున మనకింతటి సుఖముగలుగునా, యెన్నటికైనం బోక తీరదు మీరును యత్నముతో నుండుఁడని చెప్పి యారాజేంద్రుఁడు తనయిష్టమును భార్యకును మామకును దెలియపఱచెను, ఆమహేంద్రుఁడువ్యసనపడి చక్రవర్తిని సభికులనునాలింగనము చేసుకొని యల్లునకు దివ్యరత్నకిరీటంబును, సూర్యచంద్రహారములను, దివ్యమాణిక్యములను, సభికులకు వెలలేని వస్త్రాభరణములనిచ్చి దేవవిమానములమీఁదం గూర్చుండ నియమించెను. ఆరాజేంద్రుఁడును సభికులును వారివారిభార్యలతోడం గూర్చుండిరి, ఆవిమానములన్నియును భూలోకమునకువచ్చి నిలిచిన, యాచక్రవర్తియును సభికులును వారివారిభార్యలతోడ విమానములనుదిగి, మంగళవాద్యములతోడం బురిప్రవేశమయ్యెదమని యోచించి, వాటినిరప్పించి ప్రభువుపట్టపుటేనుఁగు నెక్కెను, సభికులు తురగములనెక్కిరి, త్రిలోకమోహిని ముత్యాల కుచ్చులపసిఁడిపల్లకిలోఁ గూర్చుండెను, చెలికత్తియలు సామాన్యపల్లకీలలోఁ గూర్చుండిరి, పుణ్యస్త్రీలు మంగళములు పాడుచు వెంబడిరాగా, మంగళవాద్యములతోడ పురిలోనికింబోవుచు నాయింద్రజాలకుని మహిమవలన నందరు నేత్రములను దెఱచి యేమియునుగానక విభ్రాంతినొంది యొకరిముఖమొకరు చూచుకొనుచుండిరి. ఆరాజేంద్రుఁడు సభికులనుజూచి మిత్రులారా మనమెక్కినవాహనములును, మనభార్యలును, వారెక్కినపల్లకీలును, పుణ్యస్త్రీలును, మంగళవాద్యములు నెందుబోయెను, మనమీసభయందే గూర్చుండియుండుటకు కారణమేమనియడిగిన, యాసభికులునుదిగ్భ్రమజెంది మాకేమియునుదోచలేదు మనభార్యలెందుపోయిరి, ఇదిమిగులమటుమాయముగానున్నదని పలికి తక్కినసభికులకు జరిగినవర్తమానమంతయును సాంగముగాజెప్పి మీరు మాభార్యలను జూడలేదాయని యడిగిరి, తక్కినముఖ్యమంత్రులును సామంతరాజులును బకాపకనవ్వుచు నోహో యిది మిగులఁజిత్రము, మీరు నేత్రములను మూసికొని యైదునిమిషములై యుండును, ఇంతలోపల దేవలోకమునకుంబోవుటెట్లు, దేవకన్నియలను వివాహముచేసుకొనియిరువదిసంవత్సరములుండుటెట్లు, మిగుల సుఖానందములనుభవించుటెట్లు, సర్వముదబ్బర, అంతయునుళక్కి, ముందు మీరుధరియించిన

వస్త్రాభరణములేగాని, మహేంద్రుడిచ్చిన వస్త్రాభరణములుకావు, నిజముకొంచెమైనను లేదు. ఈయింద్రజాలకుని మహిమగానుండునని పలికిరి. ఆయింద్రజాలకుఁడు రాజేంద్రా! దేవరవారినిసభికులను, జాగ్రతగానుండుఁడనిచెప్పి మహేంద్రజాలమును గావించితిని, నావిద్యావిశేషమువలన మీచిత్తము లటులవ్యాపించెనేగాని మీశరీరములు యెందును బోలేదు. చిత్తవృత్తియనిచెప్పెను. ఆమండలాధిపతి, ఓహో యిదియేమివింతకార్యము. మేము దేవలోకమున భార్యలతోడననుభవించిన యనుభవమంతయు నేత్రములను దెలిచిన నేమియునులేకపోయెను, అహో యిదిమిగులఁజిత్రమని నారువారు ధరియించియుండిన వస్త్రాభరణములనుజూచుకొని యచ్చెరువంది ముక్కులమీదవ్రేళ్లుపెట్టుకొని యద్భుతమునొందుచు, నాయింద్రజాలకుని పెక్కువిధములవినుతించి, యతఁడుఁగోరినవస్తువులను, అగ్రహారములను,ధనమునిచ్చిపుచ్చెనని చెప్పెను, ఆరామచంద్రు డద్భుతమునొంది మునీంద్రా! మహేంద్రు డెవ్వడు, త్రిమూర్తులు, ఇంద్రాదిదేవతలు యతనింగోలుచుటకుఁగారణమేమి, కనుపించిన శరీరములన్నియు నెందుండివచ్చె నెందుబోయె, నాకుదయతో నెఱింగింపుమనిన జీఋనగవుతో నామునీంద్రుండిట్లనియె.

రాజేంద్రా మహేంద్రుండనఁగా మాయయెఱుక, అతఁడు తల్లిదండ్రులులేక తనంతటతానేవచ్చిన మూలమాయ, అతఁడేభ్రమస్వరూపకమైన మాయాశబరితబ్రహ్మము, ఆమహేంద్రునకు మూలములేదు, ఆమాయకునివలన చిదాకాశమును బంచబ్రహ్మలును త్రిమూర్తులు సహాదేవతలును, నరమృగపక్షి క్రిమి కీటకాదులును వృక్షలతాదులును బుట్టెను, అనగా భ్రమవలననటులదోచెను, సర్వముమాయ, పదవులుమాయ, లోకములుమాయ, ప్రపంచముమాయ. మాయకుమూలములేదు, మూలములేనిదానికి నిలుకడయునులేదు, ఇంద్రజాలముభంగినుపించుచుండును, ఈయెఱుకలేనిదిగనుక నెవ్వరికినిగనుపించదు, యుగములపర్యంతము సమాధినిష్ఠలుగావించిన మహాఋషులెవ్వరు నాత్మనుదర్శించనే లేదు, ఈయాత్ముడేమాయయెఱుక, అతడేమహేంద్రుఁడు, అతఁడేభ్రమరూపకమైన మాయకుఁడు, అతఁడేమూలములేనివాఁడు,త్రిమూర్తులు, ఇంద్రాదిదేవతలుసహా సర్వజనులు నతనిమాయను గనజా



ఆ రాజేంద్రుని సుందరసభయును సభికులును గొప్పవెలుగున గనుపించెను.
ఆహా యిదియేమి వెలుగని యోచించుచుండగా శ్రోత్రముల కానంద
ముగా దివ్యవాద్యముల నాదములును, గజ్జలధ్వనులును వినవచ్చినందున
యతడు సభ్యులతో దిక్కు లుపరికించుచుండెను. అంతట శ్రోత్రా

మోహపుత్రీగలవారై, నలువురుదేవకన్నియలువచ్చి నమస్కరించి రాజేం
ద్రా మేము దేవవేశ్యలము. రంభ యూర్వశి మేనక తిలోత్తమలను పే
ళ్లుగలవారము, దేవేంద్రుడంపగా దేవరవారిని దోడ్కొనిపోవవచ్చితి
మి, మమ్మాదరించి మావెంట దేవలోకమునకు రావలయును, దేవరవా
రిసభలో మేముగొంత నృత్యగీతగానములు చేయునటులయుత్తరువిండ
నియెతని యాజ్ఞనుబడసి, యానలువురువేఱువేఱుగా నృత్యగీతములను
జేసి యాప్రభువునకు నత్యంత సంతోషమునుబుట్టించి, దేవవిమానము
మీదంగూర్చుండబెట్టుకొనిపోయి యందొకచోటవిమానమునునిలిపి
దేవేంద్రునిసభకువెంటబెట్టుకొనిపోయి యితడెభూలోక చక్రవర్తియ
నిచెప్పిరి. ఆదివిజపతియతని నాలింగనము చేసుకొని సన్మానించి యుచి
తాసనముమీదం గూర్చుండబెట్టి పుణ్యాత్మా నిన్ను దోడ్కొని వచ్చిన
యీనలువురుదేవవేశ్యలు మాసభలో నృత్యగీతములను జేయుదురు, నీవు
వారివిద్యలను జక్కగాబరికించి యెవరధికులో జెప్పవలయునని
చెప్పి యావేశ్యలకునుత్తరువిచ్చెను. అంతనా నలువురు వేఱు వేఱుగా
వారివారిశక్తులనుజూపించి సభవారికి మిగులయానందమునుబుట్టించిరి.

దేవేంద్రుడు చిఱునగవుతో ధర్మదేవతయైన యమధర్మ రా
జునుంజూచి మహాత్మా వీరిలోనెవ్వరధికురాలనియడిగిన యతడు రంభ
యధికురాలనిచెప్పెను, కుబేరునియడిగిన యతడూర్వశినిం జెప్పెను, అ
గ్నిదేవునియడిగిన యతడు నలువురుసమానులేనని పలికెను. తక్కినవా
రందఱును వారివారికిందోచినటులజెప్పిరి. అంతనా దేవేంద్రుడు పురు
కుత్సచక్రవర్తిని యడిగిన,యతడు తిలోత్తమ కడమమువ్వురికంటెను
దిలమాత్రప్రమాణము యధికురాలనిచెప్పెను. ఆదివిజపతి నీవునిజము
గాజెప్పితివని చేతులువట్టుచు ఘొల్లునంగీర్తించి యాలింగనము చేసు
కొని దివ్యరత్నాభరణములను దేవతాశ్వమునుయిచ్చి యాభూలోకచ
క్రవర్తినిప్రయాణముచేసియంపెను, అపురుకుత్సచక్రవర్తియత్యంతసం
తోషముతోనాదివిజపతికినమస్కరించియా దేవతాశ్వమునెక్కిభూలోక
మునకువచ్చుచుండెను, అమాయాతురగము కొంతసేపు మెల్లగానడిచి
పిమ్మటవాయువేగముగావచ్చుటచేత నతడుభయభ్రాంతుడై గుఱ్ఱము
మీదనిలువజాలక, తనశక్తికొలది కళ్లెమునుబిగియంబట్టియునది నిలు

వచ్చిమనలను వెంటఁబెట్టుకొనిపోవునని చెప్పుచుండగా నామాలడువచ్చి తనపుత్రినియారాజేంద్రునిఁజూచి యమ్మాయితఁడెవ్వడనిన యాకన్నియచక్రవర్తియని జరిగినవర్తమానమునుజెప్పెను,ఆమాలడత్యంత సంతోషముతో నాయిరువురను వెంటఁబెట్టుకొనిపోయి తనబంధువులకుం జెప్పి శుభముహూర్తంబున వివాహమహోత్సవముగావించెను.

అంతనాచక్రవర్తిమిగులసుందరియైన భార్యతోనెల్లసుఖములనుభవించుచు తనయాభరణములలోనొక్కొకటివిక్రయించి జీవించుచుండెను, ఆభ్రమతయుభర్తమాటకుబదులుచెప్పక నతనిందేవునిగానెంచి వివిధశుశ్రూషలుచేయుచు, నెల్లసుఖములనుభవించుచు సుగుణసంపత్తితోఁబ్రకాశించుచు నత్యంతభయభక్తులతోవర్తించుచు, క్రమముగా నలుగురుమొగబిడ్డలను ముగ్గురుయాడుబిడ్డలనుగనెను. ఆమండలాధిపతి మిగులయుత్సాహమునుబొంది బిడ్డలయందుమమకారముగలిగి తన కిరీటమును మకరకుండలములును వివిధాభరణములనువిక్రయించి యిరువదిసంవత్సరములు మహదానందసుఖములనుభవించుచుండెను. ఆ పల్లెయందువర్షములుకుఱియనందునమిగుల క్షామముసంభవించియందుండుమాలవాండ్రందఱు నలుదిక్కులకుంబారిపోయిరి. ఆభ్రమతయొక్కతల్లిదండ్రులునుమరణంబునొందిరి. పిమ్మటారాజేంద్రుఁడుభార్యనుంజూచి ప్రాణనాయకీమనముయొంటరిగా బిడ్డలతోడనిచటయుండవలసినదేమి, త్రాగుటకుయెంతనునీళ్లులేవు యెందైననొకపట్టణమునకుంబోదము, బిడ్డలకువిద్యాబుద్ధులుగఱపింతమనిచెప్పిన యాభ్రమతయునుసమ్మతించెను. ఆరాజేంద్రుఁడు యెడబిడ్డలనిరువురను గావడిగట్టుకొని చేతిబిడ్డనుభార్యకునొప్పగించి పెద్దబిడ్డలనలువురను మెల్లమెల్లగానడిపించుకొని ప్రయాణమైపోవుచు, నచ్చటచ్చటతియ్యనిఫలములనుగోసి బిడ్డలకునిచ్చుచు, త్రాగుటకునీళ్లుదొరకక మిగులసంకటపడుచు, సూర్యకిరణములకుఁబరితపించుచు, నడువలేనిబిడ్డలనుజెట్లనీడలం గూర్చుండఁబెట్టుచు, నీప్రకారముమూఁడుదినములుయెంతను నీరుగానక ఫలములను మాత్రమువారికిదెచ్చియిచ్చుచుండిన,యానలువురుపెద్దబిడ్డలును పెనుదాహముతోమృతిబొందిరి. అంతనారాజేంద్రుఁడును భ్రమతయును ఘోరముగాదుఃఖించుచు తక్కినముగ్గురు బిడ్డలతోడంబోవుచు,నాలన

దినము కావడిలోనుండుబిడ్డలిద్దఱునుజచ్చుటనుజూచి యారాజేంద్రుఁడు భూమిమీఁదంబడిఘోరముగానేడ్చుచుండిన, యాభ్రమతభర్తనులేవఁదీసి పురుషరత్నమా, మాయాశరీరములునిల్కడగానుండునవిగావు, మఱుమాయముగాఁబోవుచుండును, కలలోఁజూచినట్లు మేలుకొనిననేమిలేదు, సర్వముమాయ,పరిపూర్ణమునకంటెను వేరొండులేదు,మూలములేనిపేనుమాయభ్రమరూపకమని చెప్పిశాంతవచనములచేతనూరడించి,చంటిబిడ్డతోఁడనాయిరువురునుబ్రయాణమైపోవుచుండగానాబిడ్డయును బాలులేకనలువటించి యైదవదినముగతించెను. ఆభ్రమతతనభర్తనుంజూచి మహాత్మామధ్యవచ్చినబిడ్డలు మధ్యనేబోయిరి. పుట్టినవారికిఁ జావుసిద్ధము, మాయయొకటియాత్మయగుటంజేసి శరీరయాత్మలకు నిల్కడలేదు, మూలములేనిమాయనుగురించి మనమువగవంబనిలేదని చెప్పి వెంటఁబెట్టుకొనిపోవుచు, నారవదినముమధ్యాహ్నమున యాభ్రమతయునుభూమిమీఁదంబడిభర్తనుంజూచిపుణ్యాత్మానీకుమధ్యసంభవించిన చండాలసంసర్గమధ్యనేనశించెను, నాకుకాలముసమీపించివచ్చినది, నీవుపరిశుద్ధుండవై నీపట్టణమునకుంబొమ్ము నేనుబోయివచ్చెదనని చెప్పి కన్నీళ్లురాల్చుచు నాయువతీమణి ప్రాణములనువిడిచెను. అంతనారాజేంద్రుఁడు మనోదుఃఖముతోఁబత్నిమీఁదంబడి దానిగుణవిశేషములం బెక్కువిధములస్మరించుచునకటానాకుదిక్కెవ్వరనివిలపించుచుంగొంతకాలమునిరీక్షించి. ఇట్టిసుగుణసంపత్తియును పతిభక్తియునుగలభార్యతోడ నగ్నితప్తమైపోవుటచేత. పుణ్యగతిసంభవించునని యోచించికట్టెలంజేర్చియగ్నిదరికొలిపిభార్యశవమునుబడవైచి తానునుయాయగ్నిలోమునిఁగెను. ఇక్కడీసభామంటపంబున రత్నసింహాసనమునుండి. భూమికిలంఘించి యింద్రజాలకునిమహిమవలన నేత్రములుదెఱచెను, సింహాసనమునుండిభూమికిలంఘించినయాప్రభువునుమంత్రులునుసామంతరాజులును లేవదీసి, సింహాసనముమీఁదంగూర్చుండఁబెట్టిరి. ఆరాజేంద్రుఁడు వారినింజూచి కన్నులవెంటనీళ్లురాల్చుచుం దలవంచుకొనియుండినంజూచి మంత్రులును బ్రధానసామంతరాజులునుయాశ్చర్యపడి. ఇదియేమివింతకార్యమోవిచారింతమని పెద్దమంత్రిదగ్గిరకుంబోయి రాజేంద్రా! దేవరవారు సింహాసనమునుండి భూమికిలంఘించుటకును. దుఃఖముచేతందల

వంచుకొనియుండుటకును గారణమేమి, దేవరవారునేత్రములను మూసుకొనిరమారమి పదినిమిషములై యుండును,ఇంతలోనెంతటిదుస్వప్నమునుగంటిరో దయతోనాకెఱింగించుఁడనివేడెను. ఆరాజేంద్రుఁడు కన్నీళ్లుమడుచుకొనుచు మిత్రుఁడాస్వప్నముకాదు, నిజముగాజరిగినవర్తమానము, నేనుయిరువదిసంవత్సరములుభ్రమతయను జండాలకన్నియతోనెల్లసుఖములనుభవించి యేగ్గురుబిడ్డలనుగని, వారినింబోగొట్టుకొని దుఃఖించుచు, నాభార్యశవమును యగ్నిలోబడవైచియూరాయగ్నిలోబడుటకుయత్నించి దుమికినన్నుమీరేలబట్టుకొంటిరి, నేనురాజ్యమునకుందగను, వేఱొకప్రభువునేర్పరచుకొండనిజరిగినవర్తమానమంతయునెఱిగించెను,ఆమంత్రిముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని ఓహోయిదియేమివింతకార్యము, దేవరవారుమిగులదుస్వప్నమునుగంటిరి, అబ్బాయిదిమిగులయాశ్చర్యమునుబొందించుచున్నది, అంతయునబద్ధము, జరిగినదించుకైననులేదు. కలలోమీకటులఁదోచెననిపలికెను. ఆరాజేంద్రుఁడు మిత్రుఁడానేననుభవించివచ్చిననిజవర్తమానమునునీవుదబ్బరయనిచెప్పుటెట్లు. ప్రత్యక్షయనుభవంబనిపలికిన యామంత్రి రాజేంద్రా దేవరవారు నేత్రములనుమూసుకొని పదినిమిషములుండును, నిద్రభంగముచేయకూడదని మేమందరమును నిశ్శబ్దముగానుంటిమి,ఇంతలోమనసభకెన్నడుదేవతాస్త్రీలువచ్చి నృత్యగీతములనుజేసి దేవరవారిని దేవలోకమునకుందోడ్కొనిపోయిరి, మీరెన్నడుమమ్ముంబాసిపోయి యిరువదిసంవత్సరములు చండాలకన్నియతోడ సుఖించితిరి, ఆభ్రమతశవమెక్కడ, ఆయగ్నిగుండమెక్కడ, దేవరవారుసింహాసనమునుండి దుమికినకారణమేమి, కిరీటముసహా యాభరణములన్నియువిక్రయించి జీవించినటులఁజెప్పితిరి. సర్వమునబ్బర,అంతయునుశక్కి, దేవరవారుధరియించినభూషణములలోనొక్కటియైన వక్కువలేకయున్నవిచూడుఁడని నిలువుటద్దమునుదెచ్చిముందరనిలిపిరి. ఆరాజేంద్రుఁడుతనవస్త్రాభరణకిరీటములనుజూచుకొని యద్భుతమునొందియేమియునుదోచక భ్రమాన్పడియుండఁగా, నాయింద్రజాలకుఁడుప్రభువునుంగాంచి రాజేంద్రా నేనుయింద్రజాలకుఁడను,నాజాలమువలన దేవరవారిచిత్తమునకటులదోచెనగానినీవెందునుబోలేదు.చిత్తన్యాస్థయేగానిశరీరమనుభవించలేదునిజము.

గాదు స్వప్నముగాదు సర్వమును నాజాలమనిచెప్పెను. అంతనారాజేం
ద్రుఁడోహో యిదిమిగులఁజిత్రము, నీవు యింద్రజాలమని చెప్పుచు
న్నావు,నామంత్రిస్వప్నమని చెప్పెను, నేనునిజముగాజరిగినటులఁజెప్పితిని,
ఇందులోనెవరిమాటలునిజము ప్రత్యక్షముగాననుభవించివచ్చిన నాకు
మీ వాక్యములుమెప్పురావు, నాయనుభవమేసత్యమనిపలికిన యాయిం
ద్రజాలకుఁడు నిశ్చయముగానాజాలమనిపలికిన, యారాజేంద్రుఁడు శ్రీ
మహావిష్ణువువచ్చిచెప్పిన నేనునమ్ముదునేగాని తక్కినవారిమాటలనునేను
నమ్మననిపలికిన, యాయింద్రజాలకుఁడు పుణ్యాత్మా దేవరవారి యిష్టప్ర
కారము శ్రీమహావిష్ణువేవచ్చిచెప్పును, దేవరవారును సభికులును జాగ
రూకులై యుండి యాదేవునిదర్శింపుఁడనిచెప్పి తనచేతిలోని నెమలియీ
కలకుంచెను సభికులతోడఁబ్రభువునకుంజుట్టి చిత్తసంకల్పమును బొందిం
చెను, అంతనాప్రభువును సభికులును నిద్రచేమైమఱచి నేత్రములను
మూసినవెంటనే నారుగొప్పవెలుగునుగాంచి దివ్యవాద్యముల రవముల
నువిని యద్భుతమునొంది దిక్కులుపరికించుచుననేక ఘంటికారవంబుల
తోడగరుడవాహనారూఢుండై వచ్చిన శ్రీవిష్ణుదేవునిఁగాంచి, దిగ్గునలే
చినమస్కరించి యాదేవదేవుని రత్నసింహాసనముమీదఁ గూర్చుండఁ
బెట్టియామండలాధిపతియును సభికులును జేతులనుగట్టుకొనినిలిచియా
దేవునింబెక్కువిధముల వినుతించిరి. శ్రీమహావిష్ణువు చక్రవర్తినింజూచి
నీకునిజముచెప్పుటకై వచ్చినాను, నీవుయిరువదిసంవత్సరము లనుభవిం
చివచ్చిన యనుభవమంతయునుళక్కి, స్వప్నముదబ్బర, ఇంద్రజాలమేస
త్యమనిచెప్పి చూచుచుండగానే యాదేవుఁడు మటుమాయముగాఁబో
యెను, అంతనాసభికులును ప్రభువును నేత్రములనుదెఱచి ఆహామనభా
గ్యమేభాగ్యము శ్రీవిష్ణుదేవునిందర్శించి యతనివలన నిజమెఱింగితిమని
యాయింద్రజాలకుని పెక్కువిధములవినుతించిరనిచెప్పిన,యారామచం
ద్రుడద్భుతమునొంది మునీంద్రా మగుడియారాజేంద్రుఁడా యింద్రజా
లమునుబరీక్షించెనా లేదాయనియడిగిన యాతాపసోత్తముండిట్లనియె.

రాజేంద్రా భ్రమస్వరూపకమైన మాయయెఱుకను నేనేమనిచె
ప్పుదును, మిగులదట్టముగానున్నది రాకపోకలకు భ్రమయేకారణము,
పురుకుత్సచక్రవర్తి తానుముందనుభవించినయనుభవమంతయుమిథ్య

హ్మము, అదియేయచలపరిపూర్ణము, అదియేప్రకృతిద్వయదోషరహిత మైననిరాలంబము, వికారరహితమైనపరతత్వము.

మహేంద్రుడును, చైతన్యస్వరూపిణియును, అమ్మవారును, చిదాకాశమును, పరబ్రహ్మంబును, జీవేశ్వరులును, త్రిమూర్తులుసహా దేవ ఋషిగణంబులును సర్వముమాయయేగాని బ్రహ్మముకాదు. అచలబ్రహ్మమువలన నీమాయపుట్టినదియుంగాను, తల్లిదండ్రులులేక తనంతటతానేవచ్చినది, భ్రమస్వరూపమగుటంజేసి మాయయెవ్వరికింజిక్కకమటుమాయముగానే బోవుచుండును, మాయకుమూలములేదు గనుకనే శరీరములకునుమూలములేదు, మూలములేనిదానికిజననమరణములును లేవు, సర్వముభ్రమ, పరిపూర్ణమునకంటెయేమిలేదు, అంతయునింద్రజాలము, గురువాక్యముచేత మేలుకొనినవారికి పరిపూర్ణమునకంటెయేమియునులేదు, మహిమయందును, సుఖతరమైనపదవులయందును, పంచలోహములయందును, నవరత్నములయందును, లోకాలోకములయందును, క్షేత్రాక్షేత్రములయందును, స్థానాస్థానములయందును, నామరూపములయందును, గుడిగోపురములయందును, స్వర్గనరకములందును, బంధమోక్షములయందును, సుఖదుఃఖములయందును, పుణ్యాపాపములయందును, జ్ఞానకర్మములయందును, ప్రకృతిద్వయములందును, నీమనిష్ఠలయందును, ఉపవాసజపములయందును, యజ్ఞయాగములయందును, యోగతపములయందును, భక్తివైరాగ్యములయందును, హారిహారాదులయందును, శక్తిద్వయమందును, త్రిగుణములయందును, భావాభావములయందును, భేదాభేదములయందును, ఈర్ష్యాసూయతలయందును, జననమరణములయందును, జాతినీతులయందును, కులగోత్రములయందును, సగుణనిర్గుణములయందును, కోరికలుగలవిధినిషేధపరులను మాయయెటుక భ్రమస్వరూపమైవేధించుచుండును. ఇదిపునరావృత్తిమార్గము. సచ్చిదానందరహితమైన యచలపరిపూర్ణ బ్రహ్మమే నిజస్వరూపముగా నెందునుదర్శించుచు, మూలములేనిమాయ భ్రిమ రూపకమనియును, కలలోవచ్చినశరీరము మేల్కొన్న నేమిలేదనియును, సద్గురుస్వామివాక్యమునునమ్మి యచలమునకంటె యేమిలేదని నిశ్చయమైనవారేభ్రాంతిరహితులు, నిత్యానిత్యములనుదర్శించినపుణ్యాత్ములేప

కృతిద్వయదోషరహితులు వారేయచలులు,వారేయశరీరులు,వారేచా పుపుట్టుకలులేనివారు, వారే దేవభ్రాంతి లోకభ్రాంతి లోకాంతరభ్రాం తులులేనివారు, వారేపుట్టనివారు చావనివారు, వారికికులగోత్రములు లేవు, వారికివేదశాస్త్రములుప్రమాణములుకావు, వారేసర్వకాలముల యందును సర్వలోకములయందును సమస్తవస్తువులయందును పరిపూ ర్ణముగనిండి స్వతస్సిద్ధమైయుండువారు, వారేశరీరయాత్మలులేనివారు వారేనివృత్తిమార్గస్థులనిచెప్పిన,యారాజేంద్రుడానందభరితుండై యా మునీంద్రుని పాదములమీదవ్రాలి మహాత్మా దేవరనారివాక్యములుయ మృతతుల్యములు నాభాగ్యవశమునవచ్చినాకుశుద్ధవేదాంతమార్గమును ఇంద్రజాలపుకథలనుజెప్పి యత్యానందమునుబుట్టించితిరి, ఆహామిగుల యాశ్చర్యము పురూరవచక్రవర్తిదినములలో నింద్రజాలకులువచ్చిచేసి నజాలమంతయునుజెప్పుడనివేడిన యామునీంద్రుండిట్లనియె.

పురుకుత్సచక్రవర్తికథ ముగిసెను.



—*(పురూరవచక్రవర్తికథ)*—

శ్రీరామచంద్రాయెటుక ప్రభావమును నేనెంతనిజెప్పుదును, మి గులచిత్రము,మహాయద్భుతము,అతిమాధుర్యము, అసత్యమందుండుటీ పుసత్యమునందు లేదు, సత్యముముష్టిపండువంటిది, మిగుల జేదుగాబ ట్టియింద్రజాలముమిగులయానందకరమని చెప్పుటకుసందియములేదు. పురూరవచక్రవర్తి సుమంతాద్యష్టమంత్రులును సామంతరాజులును విద్వజ్జనంబులును బరివేష్టించియుండగానిండుకొలువుకూటంబునగూ ర్చుండి తాంబూలమునుధరియించుచుండెను, ఆసభకుగమలాక్షుడను పేరుగలయింద్రజాలకుడువచ్చి యాప్రభువునుసభికులనుదర్శించి రాజ రాజోత్తమా నేనుబీదబ్రాహ్మణుండను వనవాసిని వై దీకుండనని చెప్పు చుందనచేతిలోని నెవలియీాకలకుంచెనుద్రిప్పి మహేంద్రజాలమునుగా వించెను, ఆవెంటనే తాంబూలముచేయుచు నాకుమడుపునుగరంబునం బుచ్చుకొనిన ప్రభువునకు నిద్రమైకముసంభవించి నేత్రములనుమూసు కొనెను, మంత్రులును ప్రధానసామంతరాజులును ప్రభువునిద్రించుచు న్నాడనిసంగడిచేయకనిశ్శబ్దముగానుండిరి, ఆమండలాధిపతికి నింద్రజా



పురూరవచక్రవర్తి. ఇంద్రజాలికుడు. ప్రధానమంత్రి రాజులు. మంత్రులు.

లకునిమహిమవలనగొప్పప్రకాశమును, గజ్జలందియలు మొదలగుయా
భరణములధ్వనులును వినవచ్చినందుననతడచ్చెరువంది ఆహాయీవెలు
గుయెందుండివచ్చెనని దిక్కులుపరికించుచుండఁగా మెఱుపుతీఁగవలె
నొకకన్యకారత్నమువచ్చియెదుటనిలిచెను, ఆమండలాధిపతియాకన్ని

యదివ్యరూపమునుజూడఁజాలక నేత్రములనుమూయుచుండెఱచుచుం గొంతసేపుముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని యాశ్చర్యమునొందుచు, కొంతవడికిధైర్యమునుదెచ్చుకొని యోహోసుందరీరత్నమా నీవెవ్వరిదానవెందుండివచ్చితివి, నీవృత్తాంతమంతయు నెఱింగించుమని ముఖమునందానందరసమొలుకునటు లంగీకంటిచూపులతో మెల్లననడిగినయా కంబదళాక్షియిట్లనియె.

పుణ్యాత్మా నేను వంధ్యానూనుఁడను మహేంద్రునకుం బుత్రిని, నాతండ్రియే దేవదేవుఁడు, మిగులమహిమలుగలవాఁడు, ఇంద్రాదిదేవతలకునుద్రిమూర్తులకును ప్రభువు, దారుపురుషుడనుమంత్రితో నాశ్చర్యపురమునుపాలించుచున్నాఁడు, నేనాదేవునకుముద్దులకూఁతురను,నాపేరుజగద్భ్రమ నేనుపెండ్లిలేనికన్నియను నాచెలికత్తియలతోడనాడుచు బుద్ధిజాడ్యముచేత భూలోకమునకుంబోయి పుష్పములను గోయుటకై యోచించి వచ్చిపుష్పములనుగోయుచు, చెట్టుచెట్టునకుందిరుగుచుకొంతవడికినేనుదలయెత్తిచూడఁగా, నాచెలికత్తియలలో నొక్కరైనను గనుపించనందునదిగులుపడి యాప్రదేశమంతటను వెదకిచూచియెవ్వరినింగానకనేమియుందోచక భయాకులితచిత్తురాలనై దుఃఖించుచుండఁగా, నొకయువతీమణి నన్నాదరించిదుఃఖముడిపి భూలోకచక్రవర్తిమిగులధర్మాత్ముఁడుసత్యసంధుఁడు, పుణ్యమూర్తి, యాప్రభువు దగ్గిరకుంబోయి నీవర్తమానమునుజెప్పినయెడల నిన్నతఁడాదరించినీదుఃఖముడిపి నీతండ్రియొద్దకుం బంపునని చెప్పిపోయెను, అంతటనేనునీసభకువచ్చి నిన్నుంగాంచితిని, దయతోనాతండ్రియొద్దంజేర్చుమనిపలికిన, యారాజేంద్రుఁడోహోకన్యకారత్నమా నీమాటలుమిగులఁజిత్రములు, యవ్వనమంకురించనికన్నియలుతల్లిదండ్రులయాదరణీయమునేగోరుదురు,ఋతుమతులైననీవంటియవ్వనకన్నియలు పురుషులయాదరణీయమునేగోరుదురుగాని జననీజనకుల యాదరణీయమునుగోరరు, నీకునాపురియందేమియునుగొఱఁతయుండదు, నిన్నునారాజ్యలక్ష్మిగాగైకొని భూమండలమంతయు నీయాజ్ఞప్రకారముపాలించెదను. నన్నువివాహముచేసికొనిన నీయిష్టప్రకారమువర్తించుటకు సందియములేదు, దయతోనన్నువివాహముచేసుకొనుటకుసమ్మతింపుము,నీయందుభ్రమగొనియున్నా

ను, .పూవిలుకాఁడుపొంచిపొంచి బాణములేయుచున్నాఁడు,ఎప్పటిసుఖము
ప్పుడుతామసింపవలదు త్రిలోకనాయకీరత్నమా నన్ను నీభర్తగాగ్ర
హింపుము, అకటా నేనెటులమన్మదాగ్నింభరింతునని ప్రార్థించెను, ఆ
కన్నియపక్కననవ్వి యోహో రాజేంద్రా నీమంచితనమునుధర్మగుణ
మును త్వరలో నేగనుపఱచితివి, ఇట్టివిపర్యాసమెందైననుగలదా, ధర్మా
త్ముండవనిచెప్పగావినివచ్చిప్రార్థించినందుకు వివాహముచేసుకొనుమని
నీవునన్నుంబ్రార్థించెదవా,ఆహోయిదియేటిధర్మము,నాతండ్రిమిగులమా
యకుఁడు నీరులేనిచోటనీరును, అగ్నిలేనిచోటనగ్నియునుబుట్టించును,
లోకములనన్నింటిని నిమిషకాలంబున నశియింపంజేయును, నశించిన
లోకములనామహాత్ముఁడు నిమిషములోననిర్మాణముసేయును,సూర్యచం
ద్రులనుబట్టిబంతులాడును, అతఁడలిగినమూఁడులోకములు తల్లడిల్లును
కాఁబట్టిక్రమముదప్పక నలవిగానికోరికనువిడిచి నన్ను నాతండ్రియొద్ద
కుంబంపుము, నాతండ్రిశరణాగతరక్షకుఁడగుటంజేసి నీవా దేవునిశరణు
వేడిననతఁడు నీయిష్టప్రకారమువివాహముగావించినను గావించునుగాఁ
బట్టి, త్వరితముగానన్నుంబంపుమనిపలికెను. ఆరాజేంద్రుఁడానీతివచన
ములనువినక పెడచెవులంబెట్టి,ఓహో సుందరీరత్నమా నీవాక్యముల
కు నేను వెఱగుపడను, నీవునాయందుఁ బ్రేమయుంచుము,నీకోపమునకు భ
యపడుము నేగాని మఱియెవ్వరికినిభయపడువాఁడనుగాను, నీతండ్రిఁగా
దతనితోడమూఁడులోకములేకీభవించి నామీఁదదండెత్తివచ్చిననునన్ను
జయించుటకునలవిగాదు,నాకుందెలియనిదివ్యాస్త్రములులేవు,ప్రాణము
లయందపేక్షయునులేదు, నన్నుస్వల్పునిగానెంచవలదు, నీజననీజనకుల
యందుఁ బ్రేమయుంచవలదనిపలుకుచుండిననొకదూతవచ్చి యారా
జేంద్రునకునమస్కరించి, పుణ్యాత్మా నేను ద్రిలోకనాయకుండైన సం
ధ్యాపుత్రునిదూతను,జగద్భ్రమనిమిత్తముగావచ్చితిని, మారాజపుత్రి
ని త్వరితముగానంపుమనెను, ఆరాజేంద్రుఁడతనికిమర్యాదలుగావించినే
నీకన్నియనువిడుచుటలేదు వివాహముచేసుకొనుటకు యత్నించి యు
న్నాననిపలికిన యాదూత, మానవేంద్రా నీవుయలవిగానికోరికలు గోర
వద్దు, అకటా మహేంద్రుఁడుమిగులమాయలుగలవాఁడు, ప్రపంచమం
తయునతనిమాయగానెఱుంగుము, అతఁడలిగినలోకములన్నియుపాడై

పోవుదు, గొప్పమనంబుతో నీరాజపుత్రినివిడువుము. లేనియెడల కీడువాటిల్లుననిపలికిన, యాచక్రవర్తికోపించి యాజగద్భ్రమను యంతఃపురంబునకుందోడ్కొనిపోయి యాలతాంగినియొకసువర్ణపు మందసములోనుంచి, తనపడకటింటిలోనం బెట్టించి బీగముద్రలువేయించి, మహాశూరులతోడందనపెద్దమంత్రిని యచటకావలియుంచి, యుద్ధమునకాయత్తులై యుండుడని చెప్పి తనసైన్యాధిపతినింబిలిపించి, మిత్రుఁడా! మనమీదికి మహేంద్రుఁడనుదేవోత్తముడుదండెత్తివచ్చునట, అతఁడుమిగులమాయలుగలవాడట, నీవుమిగులజాగ్రతతోనుండుము, వాయుస్తంభన, అగ్నిస్తంభన, జలస్తంభన, గజకర్ణ,గోకర్ణ, మోహనాదివిద్యలుగలమంత్రవాదులను, తంత్రవాదులను ముందునిలుపుకొని మనముజయింపవలయును, మూలబలముతోడరప్పించి శత్రువులనుహతముగావింపవలయుననిదిట్టముగా జెప్పి మఱలకొలువుకూటమునకుంబోయి సింహాసనముమీదంగూర్చుండి, దేవవాద్యముల రవమును రణభేరీశబ్దములనువిని మహేంద్రుఁడు యుద్ధమునకువచ్చినాడని యోచించి, తనసభికులనుజూచి మిత్రులారా మీరునానిమిత్తముగా మహేంద్రునితోఁబోరాడి నాకుజయము గోరవలయును, త్వరితముగా లేచి యుద్ధసన్నద్ధులై రండనియుత్తరువిచ్చి యారాజేంద్రుఁడు మూడులక్షలచతురంగబలములను, యేబదివేలుమహాశూరులైనమూలబలమునుమూఁడువేలు అతిరథ,మహారథ,సమరథులను, మున్నూటిద్దరుమంత్రవాదులనువెంటఁబెట్టుకొని దిక్కులు ప్రతిధ్వనులిచ్చునటుల ఘూర్ణిల్లఁజేయుచు, ముప్పదియిద్దరుసామంతరాజులను యేడ్గురుమంత్రులందనకుఁజక్రరక్షకులుగాజేసుకొనివచ్చి యుద్ధభూమినినిలిచినంగాంచి, యామహేంద్రుఁడుఁగోపించి,దురాత్మా! నీవుమదగర్వముచేత నాపుత్రినియంతఃపురమునదాచి, నాతోడ యుద్ధముచేయుటకు వచ్చితివిగదా, ఆహా నీవుమిగులశూరుఁడవు నాప్రభావమెరుంగకవచ్చితివి, నేనులోకారాధ్యుఁడను,నిమిషములోపల నాపుత్రినిరప్పించి నిన్నును నీసైన్యములను హస్తములనుగట్టించెదనని పలికి హుంకరించినమాత్రముననే యాజగద్భ్రమవచ్చి తండ్రియొద్దనిలిచెను, ఆమండలాధిపతియును మంత్రులును ప్రధానసామంతరాజులును, అతిరథమహారథ సమరథులును మంత్రతంత్రవాదులతోడసర్వ

జనులాయుధములను విడిచి హస్తములనుగట్టుకొని చిత్రించినబొమ్మల వలెకదలక మెదలక నిలిచిరి, వారియవయవములు వారికి సాధ్యపడక పోయెను. ఎక్కడి యేనుగులక్కడనే, ఎక్కడిరథములక్కడనే, ఎక్కడి గుఱ్ఱములక్కడనే, ఎక్కడిభటులక్కడనేనిలిచియుండినంజూచియాచక్రవర్తి యాశ్చర్యపడి, అబ్బా యిదిమిగులయద్భుతమని యోచించుచుండగా, నామహేంద్రుని ప్రభావమువలన వికారస్వరూపములుగల మిగులభయంకరములైన యనేకభూతంబులుద్భవించి, యామండలాధిపతినిందప్పం దిక్కైన చతురంగబలములను శూరులను మంత్రవాదులను మంత్రులను ప్రధానసామంతరాజులను బట్టుకొని మింటికెగసిపోవుటం జూచి చక్రవర్తిమిగులం దిగులొందికన్నీరు విడుచుచునాజగద్భ్రమనుం జూచి, ఆహా నిన్ను నమ్మినందుకు దైవమునన్నిటులంగావించె నేనేమిచేయువాడనని దుఃఖించుచుండిన యచటికిబ్రహ్మవిష్ణుమహేశ్వరులువచ్చి చక్రవర్తినింగాంచి యాదరించి రాజేంద్రా! మేముత్రిమూర్తులము, వంధ్యాసూనుడైన మహేంద్రునిమంత్రులము, మేమాదేవుని యాజ్ఞను నడిపింతుము. అతనిమాయనుగనజాలక తపించుచున్నారము, లోకములతనిసంకల్పమువలనం బ్రకాశించుచున్నవి, వికల్పము దోచినసర్వమునశించును, నీవును నీసైన్యములును యతని కోపదృష్టికి నెంతమాత్రము త్వరితముగా నామహాత్మునింబ్రార్థించిప్రాణములనునిలుపుకొనుము, లేకుండిన యపాయముసంభవించునని చెప్పి యామువ్వురు మూర్తులదృశ్యులైరి. అంతనాచక్రవర్తి మహేంద్రునింధ్యానించుచు మెల్లగారథమునుండిదిగి పాదచారియై పోయియామహేంద్రుని పాదములమీద వ్రాలివినుతించిన, యామహాత్ముడతని నాలింగనముచేసుకొని నీకోరినవరమిత్తునడుగుమనిన యాచక్రవర్తిస్వామీ దేవదేవోత్తమా! నాకీజగద్భ్రమనుందప్ప వేరొండుకోరికలేదు, దయతో నాకిచ్చివివాహముగావించుడనివినుతించెను. ఆమహాత్ముండుసంతసించి యతనికభయమిచ్చి చక్రవర్తినిజగద్భ్రమను తనవిమానముమీదంగూర్చుండబెట్టికొనిపోయి మంగళవాద్యములతోడం బురప్రవేశముచేయించి, శుభముహూర్తంబున యావధూవరులకు మంగళస్నానములు చేయించి వివాహమహోత్సవముగావించెను. త్రిమూర్తులునుయింద్రాదిదేవతలునుమహా

ఋషులునుయీదంపతులనుదీవించి వారివారినిలయములకుం బోయిరి.

అంతనాచక్రవర్తి దేవకన్నియయైనజగద్భ్రమంగూడి మహదా నందసుఖములనుభవించుచు, నాపడకటింటికిందాపించిన దివ్యరత్నము లనుజూచిచూచి యద్భుతమునొందుచు, దేవవిమానముమీద భార్య నుంగూర్చుండఁబెట్టుకొని తలచినలోకములకుంబోయి యందుండువిం తలనుజూచుచు, దివ్యరత్నమంటపములయందును కేళీకాగృహముల యందును, బూపొదరింద్లయందునుగ్రీడించుచు, సైకతభూములయందు సుఖనిద్రజెందుచు, నూతనవస్త్రాభరణములను బ్రతిదినము ధరించుకొ నుచు, నీప్రకారము ముప్పదిసంవత్సరములు దేహమును పత్నీపుత్రహి తబంధ్వమాత్యులనురాజ్యమునుమరచియుండెను.

ఒకనాడాయింద్రజాలకునిమహిమవలనజ్ఞప్తికివచ్చి భార్యనుంజూ చియోత్రి లోకసుందరీరత్నమా, నేనుయీలోకమునకు వచ్చినిన్ను వి వాహముచేసుకొని ముప్పది సంవత్సరములయ్యె, మహదానందసుఖము లను భవించితిమి,మనలోకమునకుంబోవుటకుసమ్మతించుమనిప్రార్థించి న యాకంజదళాక్షియునుసమ్మతించెను, ఆరాజేంద్రుఁడు మహేంద్రున కునమస్కరించి యతనికిందనయిష్టమునుజెప్పి సెలవుపొంది వివిధవ స్తువులను దేవనాగరత్నములనుముప్పయి చెలికత్తియలను వస్త్రాభర ణములను బుచ్చుకొని విమానముమీద నాజగద్భ్రమను దానిముప్ప దిచేడియలను వివిధవస్తువులనుబెట్టుకొని తానునుంగూర్చుండి భూ లోకమునకువచ్చి యూరిబైటవిమానమునుదిగి మేళతాళములతో డంబురప్రవేశమునుచేసి జగద్భ్రమనుదాని చెలికత్తియలను యంతఃపుర ములోనునిచి తానుకొలువుకూటమునకువచ్చి తనసింహాసనముమీదం గూర్చుండి యింద్రజాలకుని మహిమవలన నేత్రములంటెఱచి తనసభి కులను పెద్దమంత్రియైనసునీతినింగాంచి, ఓహో మిత్రులారా! మీ రందఱు మహేంద్రునిమాయకుకదలమెదలకబంధింపఁబడి, రాక్షసుల వాతంబడితిరే మఱల యెట్లువచ్చితిరి, నిన్నుంబెద్దమంత్రివనినమ్మి శూరు లతోడంగాపలి యుంచియుండఁగా, నాయాజ్ఞను జెల్లింపకబీగముద్ర లువేసి దాచిన యాజగద్భ్రమనునెటులవిడిచితివనిపలికిన,యాపెద్దమం త్రియును సభికులును యాశ్చర్యపడి రాజేంద్రా దేవరవారి మాటలు

మిగులజిత్రములుగానున్నవి, నేనెన్నడు మీయాజ్ఞకుమీఱితిని, సభికు లెన్నడురాక్షసులవాతంబడిరి, ఆమహేంద్రుండెవ్వడు, ఆజగద్భ్రమయెవ్వతె, మాకేమియుం దెలియదనిపలికిన యారాజేంద్రుఁడోహో మీరు యీముప్పదిసంవత్సరములకే మఱచితిరాయనిన, యామంత్రి యాశ్చర్యముతో నప్పుడుజరిగినవర్తమానమంతయును దేవరవారేవినుపించుడనివేడిన,యాచక్రవర్తిజరిగినవర్తమానమంతయునుజెప్పెను. ఆ మంత్రియునుసభికులునుయొకరిముఖమొకరుచూచుకొని యాశ్చర్యపడిరి, అంతనాసుమతి యోచించి రాజేంద్రా దేవరవారు నిద్రమైకమువలన పదినిమిషములకాలము నేత్రములను మూసితిరి, అప్పట్లో మీకు స్వప్నముకలిగియుండునేగాని నిజముగాజరిగినవర్తమానముకాదు,మీరెన్నఁడు ముప్పదిసంవత్సరములు మమ్ములనువిడిచి యుండివచ్చితిరి, ఆహామిగులఁజిత్రమైన కలనుగంటిరనిపలికిన, యారాజేంద్రుఁడు మిత్రుఁడానీవు నిదానమునుదప్పి పలుకుచున్నావు, నేనుప్రత్యక్షముగా ముప్పదిసంవత్సరములనుభవించివచ్చిన యనుభవమంతయుంగలయని చెప్పెదవు, ఆహా యిది ప్రత్యక్షవిరుద్ధము,నిజమైనవర్తమానమును నేనుజెప్పియుండఁగా నీవుస్వప్నమనిసాధించుటెట్లనిపలికిన, యామంత్రి ప్రభువు కోపమునకుశంకించక కొంతసేపుయోచించి రాజేంద్రా దేవరవారు కోపించవలదు, మీరుచెప్పినదంతయునబద్ధము, నిజముకొంచెమైనను లేదు, వంధ్యయనగా=గొడ్డురాలు, గొడ్డురాలకు బిడ్డయుండునా, అతఁడుదేవోత్తముండెట్లయ్యె, కొయ్యపురుషుఁడుమంత్రియెట్లయ్యె, జగద్భ్రమనిజమైనభ్రమయేగాని స్త్రీకాదు, సర్వముభ్రమరూపకమైనస్వప్నము, అనుభవమంతయునుశక్కు, దేవరవారుముందుధరియించియుండిన వస్త్రాభరణములేగాని మహేంద్రుడిచ్చినవికావనిపలికిన, యారాజేంద్రుఁడు ఓహోమంత్రీనీవిటులసాధించుచున్నావనిపలికెను,ఆయింద్రజాలకుఁడుపకపకనవ్వుచు, ఓహోరాజేంద్రా! నేనుయింద్రజాలకుండను. నామహేంద్రజాలమువలన దేవరవారిచిత్తమునకటులఁదోచెనే గాని నిజముగాజరిగినదికాదు, స్వప్నమునుగాదు, స్వప్నేంద్రజాలములకు చిత్తమేకారణముగాఁబట్టిమంత్రిస్వప్నమనిసాధించెను, సర్వమునామాయగాని నిజమైనయనుభవముగాదనిపలికిన, యామండలాధిపతిప

అఁగుపడి యేమియునుదోఁచక తానుధరియించియుండిన వస్త్రాభరణములనుజూచుకొనియును భ్రమపీడకయంతఃపురములోనికింబోయి నగళ్లన్నియును వెదికియెందునుజగద్భ్రమను దానిచెలికత్తియలనుగానక ముక్కుమీఁదవ్రేలుపెట్టుకొనియద్భుతమునొందుచు, నాయింద్రజాలకు నింజూచి మహాత్మాముందుగానాకుందెలియజేయక జాలమేలగావించితివి, నాకు సందియంబుజనించుచున్నదనిపలికి యతనింగీర్తించెను. సభవారందరునాశ్చర్యపడి యానందించిరిగాఁబట్టి, అసత్యమేజనరంజకంబనిచెప్పిన, యారామచంద్రుఁడు, మునీంద్రా! దేవరవారివాక్యములమృతతుల్యములునామనంబింకను యింద్రజాలమునే విననోరుచున్నది, పురూరవచక్రవర్తియాయింద్రజాలమును మఱలఁబరీక్షించెనాయనియడిగినయావసిష్ఠమహాఋషి, రాజేంద్రా! ఆచక్రవర్తియేలఁబరీక్షించకవిడుచును, చక్కెరనుదిననివారునుంగలరా, అందరికినితీపురుచ్యముగానేయుండును,ఆపురూరవచక్రవర్తియింద్రజాలకునింజూచిమహాత్మానీవిద్యావినోదములనుజూపుమనినయాయింద్రజాలకుఁడుమంచిదిదేవరవారును సభికులును జాగ్రతగానుండుడనిపలికియింద్రజాలమునుగావించెను.ఆజాలమువలనరాజేంద్రుఁడునుసభికులునునేత్రములనుమూసిరి,ఆవెంటనేవారికిందమపట్టణమును నలుదిక్కులునుజక్కగాఁగనుపించెను, ఇదియేమియింతటివెలుగు యెందుండివచ్చెనని యోచించుచుండగా, నాపురికినలుదిక్కుల యందగ్నియుద్భవించి భయంకరముగామండుచు, నాపురమంతయును గాల్చుటనుజూచియందరుభయపడి గొప్పకంఠధ్వనితోనేడ్చి నేత్రములనుదెఱచిరి, యాయింద్రజాలకుఁడువారినందరిని యాదరించి మీరుభయపడియేడ్చుటకు కారణమేమనియడిగిన, యారాజేంద్రుఁడుజరిగినవర్తమానమునుజెప్పెను, ఇంద్రజాలకుఁడుసర్వమునామాయ, మీచిత్తములటులవ్యాపించెను, మీపురమునుజూడుడనిచెప్పి,మఱియునుగొంత జాలమునుజూపించిన యారాజేంద్రుఁ డద్భుతమునొంది యాయింద్రజాలకునిం గీర్తించి యాలింగనముచేసుకొని యతఁడుఁగోరినవస్తువులన్నియునుయిచ్చిసువర్ణరత్నములతోఁబూజించి సెలవిచ్చిపుచ్చెననిచెప్పెను. ఆరామచంద్రుడద్భుతమునొంది,మునీంద్రా! స్వప్నమునకును,యింద్రజాలమునకునుభేదమేమనియడిగిన,యామునీంద్రుఁడు,రా

చి మాధనమును వస్త్రాభరణములనుదోచుకొనిపోయిరి, మాకిచటంజుట్టములెవ్వరులేరు, దేవరవారుసహాయముచేసి మేము మాదేశమునకుం బోవునటులంజేయుట మిగులనుపకృతియు నాదరణీయంబునునై యుండుననిపలికెను. ఆరాజేంద్రుఁడుదనకట్టెదుటం దొలుకరిమెఱుపు తీగవలెనిలిచి కనులకు మిఱుమిట్లుఁగొలుపుచుండెడు యాయింతిముఖంజూచి ఆహావిధాతయిట్టిసుందరీమణిని నాకుభార్యఁగాసృజించక నీదరిద్రునకుభార్యగాసృజించెను, ఈబిసరుహదళాక్షితోడం భోగించని జన్మమెందుకని పెక్కువిధములయోచించుచు, చంచలంబగుచిత్తముతో నాచపలాక్షినింజూచుచు, దానిపురుషునింగాంచియోపథికుడా మీరుదొంగలచే మోసపోయి వచ్చితిరా, మంచిది మీకు ధనమును వస్త్రాభరణములనునిచ్చి మార్గసహాయంబొనగూర్చి మీపురికింబంపెదను, మీరిచటరెండుదినములుండి పొండనిచెప్పుచుండఁగా, వేరొకపురుషుఁడుపెనుదుఃఖముతోవచ్చి యాప్రభువునకునమస్కరించి రాజేంద్రా దేవరవారుపాలించెడుధర్మపరిపాలనయందిట్టి యకృత్యముజరుగవచ్చునా, నాడెందంబెటియుచున్నయది నేనేమనిజెప్పుదును, ఈకాంతామణినేనగ్నిసాక్షిగా వివాహము చేసికొనినభార్య, ఈమాయకుఁడు నిన్నటిదినము నాయింటికియతిథిగావచ్చెను, నేనితనినాదరించియన్నముపెట్టిస్థలమిచ్చితినిరాత్రివేళనన్నుమోసపుచ్చినాభార్యంగొనివచ్చెను, తెల్లవారినవెనుక నేనునాభార్యకుంగానక యచ్చటచ్చటవెదికిజాడలనుగనిపట్టివచ్చితిని యీయిరువురను దేవరవారి కొలువుకూటమున గనిపట్టితిని. ఇట్టియన్యాయమెందైననుగలదా మీరువిచారించి యీ దురాత్మునకుందగినదండనగావించి నాభార్యనునాకునిప్పించవలయుననిపలికిదుఃఖించెను. ఆరాజేంద్రుఁడువానినాదరించి భయపడకుండుమని మొదటివానింబిలిచి యోరీయిదినీభార్యయనిపలికితివి నీదొంగతనముతెలియవచ్చెను, ఆదరించియన్నముపెట్టినవానిభార్యంగొనివచ్చినదుర్మతివి, నీకుందగినదండనగావింపకవిడువను నిజముచెప్పుమనిన, యతఁడుచక్రవర్తికినమస్కరించి రాజేంద్రా! నేనుబొంకులాడువాడనుగాను, నేనగ్నిసాక్షిగావివాహముచేసుకొనినభార్యగానివేరుకాదు, వీఁడెవఁడోదురాత్ముఁడు మావస్త్రాభరణాదులపహరించినదొంగలలో వీఁడొకఁడుగానుండును, నాభార్యనుం

గూడనపహరింపందలఁచి దేవరవారితో నిటులం బ్రేలుచున్నాఁడు వీనికిం దగినదండనగావించుడని పలికెను. ఆరాజేంద్రునకు నేమియునుఁదోచక నోహోయిది మిగులఁజిత్రమైనవివాదముగానున్నయది, వీరికిసాక్షులెవ్వరు, ఈసుందరీమణినివిచారించి వీరిద్దరిలోనేరముగలవానిశిక్షింపవలయునని యోచించి, యాబిసరుహపత్రాక్షినిం దగ్గఱకుంబిలిచిచంద్రముఖి నీవునిజముచెప్పుము, వీరిలోనెవరునీభర్తయనియడిగిన, యాకంజదళాక్షి, పుణ్యాత్మా! దేవరవారితో నేనేమనిజెప్పుదును. రూపమునందును, ఆకారమందును, యవ్వనమందునిద్దఱునొక్కటేవిధముగానున్నారు. నాకేమియుందోచలేదు మిగులమోసముగానున్నదనిపలికెను. ఆరాజేంద్రుఁడు వారినింజక్కఁగాఁబరిశీలించి వారిరువురిరూపం బొక్కటిగానుండుటంబట్టి భేదమేమియుంగనజాలక యద్భుతమునొంది యిందుముఖి నీభర్తయందేమి గుర్తులున్నవో చెప్పుమనిన యామాయలాడియిట్లనియె.

ఓపుడమిఱేడా! నాపతికియెడమతొడయందు గాయపడినమచ్చయును గుడిభుజముమీఁదం బుట్టుమచ్చయునున్నవని చెప్పెను. అంతనాప్రభువువారినింజూచి మీమీతొడలయందును భుజంబులయందునుం డెడుయంగమచ్చములంజూపుఁడనిన వారిద్దఱునాయువిదచెప్పినచొప్పనగురుతులంజూపించిరి, ఆమండలాధిపతిమిగులయద్భుతమునొందియామృగాక్షినింజూచి యిందుముఖియింకేమిచేయవచ్చునని యడిగినయాయువతీమణి నాభర్తతనకుడిహస్తముననగ్నియు నెడమహస్తమునను దకంబును సృజించగలండని చెప్పెను, ప్రభువువారిరువురినింజూచి మీలోనెవరుకుడిహస్తముననగ్నియు నెడమహస్తమునను దకంబునుబుట్టింతురో వారికి నిదిభార్యయనిపలికిన, వారునేనుసృజింపగలను నేనుసృజింపగలనని యిద్దఱుంగుడియెడమ హస్తములననలోదకములను సృజియించినంజూచి యారాజేంద్రుఁడద్భుతమునొంది, ఆహో యిట్టివాదమెటులంబరిష్కరింపనగునని మనంబునవితర్కించుచుండఁగానామాయావాదులిరువురుం బ్రభువునకునమస్కరించి రాజేంద్రా మేమిరువురము యుద్ధము చేసిమాలోనెవ్వరు బ్రదికివచ్చెదమో వారికీయువతీమణి నివ్వవలయునని పలికిరి. ఆమండలాధిపతితనమనంబున నీదురాత్ములిరువురుహత

మైనవెనుక మనమీయిందుముఖిని వివాహముచేసుకొందమని యోచించి వారిచ్చచొప్పున యుద్ధంబునకు సెలవిచ్చెను. అంతనాయిరువురుమాయకులు భుజములనుదట్టుచు ఘోరరూపులై వీరాలాపములాడుచుం గొంతసేపుభూమిమీద మల్లయుద్ధమునంబోరాడి, మింటికెగసియందు భయంకరములైన తర్జనభర్జనాదులుసేయుచుఁ బ్రతాపములుపలుకుచు రక్తములుగురియించుచుఁగండలుదొఱఁగించుచు, నార్భాటములు సేయుచుం బోరాడుచుండిన, యారాజేంద్రుఁడు వెఱఁగుపడి మనకేమి యుపద్రవములు గావింతురోయని యోచించుచుండఁగా, నాయిరువురి శిరంబులును గాత్రములును భూమిమీదంబడుటనుజూచి యామాయలాడి, అకటా మీరిరువురును హతమైతిరాయని దుఃఖించుచుండెను, అమండలాధిపతియును వారిగాత్రములను శిరములనుజూచి దురాత్ములిరువురుహతులైరి, మనయిష్టమునుదీర్చుకోవచ్చునని మనంబుననుప్పొంగి యాకులుకులాడినింజూచి, ఓహోసుందరీరత్నమా! యీదురాత్ములనిమిత్తమునీవేలశోకించెదవు, నేనుండఁగా నీకేమిభయము, నేనిన్నువివాహముచేసుకొని పట్టణపుదేవిఁగాగైకొందును నీకిది సంతోషకాలము గాని దుఃఖకాలముగాదు, నీనగుముఖముతోనన్నుంజూడుమనిన, యాయిందుముఖి రాజేంద్రా నన్నునీబంధువులునిందించి రట్టుపఱతురేమో యనిపలికిన, యతఁడునిన్నునాబంధువులు గొనియాడునటులఁజేయుదును సంశయింపవలదనిన, యామాయలాడి ముఖకమలమునువికసింపఁజేసి కీకంటిచూపులప్రభువునుంజూచెను. అరాజేంద్రుఁడు పంచశరుని బాణములకుందత్తరపాటునొంది వివాహయత్నమును గావించి యాపూబోడిం దనయంతఃపురమునకనిపి పురిశృంగారమును గావించుచుండఁగా, దేవేంద్రుఁడుదేవగణముతోడవచ్చి యారాజేంద్రునిచేతంబూజింపఁబడి యతనియభిప్రాయమునెఱింగి, తానావివాహమునకుముందు నిలిచి నిర్విఘ్నముగా వివాహమునునెరవేర్చి యా దంపతులనుదీవించి తనలోకమునకుంబోయెను, త్రిమూర్తులునువచ్చిదీవించియిదిజగన్మోహినినీయదృష్టవశమున నీకుసంభవించెను సుఖముగానుండుడనిపలికి వారివారిలోకములకుంబోయిరి, అంతనారాజేంద్రుఁడు మిగులసుందరియైన యాభార్యతోనెల్లసుఖములనుభవించుచుం బహుదినములు కొలువు

కూటమునకుంబోక యంతఃపురముననుండి పదియారవదినము సభకుం
బోయి తనసింహాసనముమీఁదంగూర్చుండి విచారణ చేయుచుండఁగా;
నామాయకులలోనొకఁడువచ్చి ప్రభువునకు నమస్కరించి, రాజేంద్రా
నాశత్రువును హతముచేసివచ్చితి, నాభార్యనునాకిండనియడిగిన యా
మండలాధిపతి యతనింజూచి గుండెలుఝల్లనవెఱఁగుపడి కొంతసేపు
ప్రమోన్పడియుండి,పిమ్మటఁగొంతధైర్యమునుబొంది యోరిమాయకుఁడా
యింతకుముందుగా నీశత్రువువచ్చి యాలతాంగినిం దోడ్కొనిపోయె
ను, బిమ్మటనీవునువచ్చియడుగుచున్నావు, మీమాయలు మంత్రములు
మాకుండెలియవు వచ్చినత్రోవనుంబట్టి పొమ్మనిగదమాయించిపలికి
న,యామాయకుఁడు పక్కుననగి,ఓహోరాజేంద్రా!నీవుసత్యసంధుఁడ
వని నమ్మితి నిటులయబద్ధములాడవచ్చునా, ఆచిన్నవాఁడు నూతంబడిన
యావస్త్రమునాకబ్బునను లోకోక్తిప్రకారము మేమిరువురము యుద్ధ
ముచేసివచ్చినవెనుక మాభార్యను వివాహముచేసుకొనయత్నించియుం
టివిగాబోలును, ఆహాపీయిష్టము నెరవేర్చికొనినటులయున్నది, అందు
వల్లనే యబద్ధమాడితివి. నేనునాశత్రువుంజంపివచ్చియుండఁగా వాఁడు
వచ్చి వెంటఁబెట్టుకొనిపోయెనంటివి, కటకటా యిట్టియకృత్యమెందైన
నుగలదా సత్యసంధుండవనినమ్మితిని, పరస్త్రీలోలుఁడవని యెఱుంగక
మోసపోతిని. ఇప్పుడైనను నాభార్యను నాకిమ్ము నేనుఁదప్పితము
లెంచు వాడనుఁ గాను, నీవు పరిపూర్ణ కటాక్షముతో నా భార్యను
నాకొప్పగింపుము లేనియెడలఁ బ్రమాదము సంభవించును, నీవుచూ
చుచుండఁగానే యంతఃపురమునుండి నాభార్యనురప్పించి నీపట్టణమంత
యుంగాల్చి మహాప్రవాహములోఁగొట్టుకొనిపోవునటులఁ జేయుదునని
పలికెను. అందుకారాజేంద్రుడేమియునుబలుకక విచారపడుచునుండఁ
గా, నామాంత్రికుఁడువెంటనే తనభార్యనురప్పించి యోసిదుష్టాత్మురాలా
నాప్రభావ మెఱింగియును సుఖమునకాశించి రాజేంద్రుని వివాహము
చేసుకొంటివిగదా, నిన్నువ్రతభంగముగావించిన నీచక్రవర్తిపాటుచూ
డుమనిపలికి యతనిపట్టణముమీఁద నగ్నినిదరికొలిపెను. అగ్నిదేవుఁడు
చిటపెటయనుశబ్దములతో నిప్పుకణములనురాల్చుచుఘోరముగామం
డుచు నాపురియంతయుంగాల్చి భస్మముగావించుటనుజూచి యారా

జేంద్రుఁడు పెనుదుఃఖముతో నేమియునుజేయజాలకుండఁగా నంతట మేఘములుగ్రమ్మి యురుములు మెఱుపులతోఁడమిగుల విస్తారమైనవర్షమునుగురిపించి గొప్పప్రవాహముగావించెను. భయంకరమైనయాప్రవాహములో నేనుఁగులును, గుఱ్ఱములును, బదాదులును, బత్నీపుత్రబంధువర్గంబులునుఁగొట్టుకొనిపోవుటంజూచి భయభ్రాంతుఁడై యచ్చోరువందియుండఁగానాప్రవాహముకొలువుకూటమునుముంచితనమంత్రులనుసామంతరాజులను విద్వజ్జనంబులనుం గొట్టికొనిపోవుటంజూచి,యామండలాధిపతి కన్నీరువిడుచుచుండిన, యాప్రవాహము యతనిసింహాసనమును బోర్లపడఁద్రోచిన, యారాజేంద్రుడు ఆహా పరస్త్రీగమనముచేత నిటులసంప్రాప్తమయ్యె నేమిచేయవచ్చుననిదుఃఖించుచు, నాప్రవాహముమీఁదఁగొట్టుకొనిపోవుచు, నెవ్వరురక్షించగలరని తత్తరపడుచు, నొకసాల వృక్షమాప్రవాహముమీఁదఁగొట్టుకొని వచ్చుటంజూచి త్వరితముగా దానింబట్టుకొని ప్రాణములనుదప్పించుకొని యావృక్షముతోఁడనొకద్వీపమునుజేరి, యచటావృక్షమును విడుచుటకును జేతులను గదలించుటకునుసాధ్యపడక దుఃఖించుచుండిన,యచటికొక సుందరీరత్నమువచ్చి యతనిపట్టువదలించి యతనిచుట్టును నగ్నిదరికొలిపి వేడిమిని బుట్టించెను. అంతనామండలాధిపతికి కాలుసేతులువశపడి లేచికూర్చుండి.యాతలోదరినింజూచి యిందుముఖి నీవెవ్వరిదానవునాప్రాణములను గాపాడుటకై వచ్చిన ధర్మదేవతవుఁగానుందువోయనిన యాకన్నియ రాజేంద్రా నేనుధర్మదేవతనుగాను, ధర్మదేవతనాయక్క.యదిమాలది, నేనుఁగుక్కనుదినినదానను, పెండ్లిలేనికన్నియను, నిన్నువివాహముచేసుకొనయత్నించివచ్చి నాననిపలికిన, యతఁడు తలయూడించి ఓహో యిదియేమి యన్యాయము నేనుత్తమక్షత్రియుండను, నీవుమిగులసుందరివి నీవర్తమానమునునిజముగాఁజెప్పుమనిన; యాకంజదళాక్షి రాజేంద్రా! ఈద్వీపముననుండువారందఱును మాజాతివారేగాని వేరొకజాతివారులేరు, అందఱునుగుక్కనుదినినవారే, మాకుజాతియును గులగోత్రములునులేవు, అరుంధతి మాజాతికన్నియ, శ్యామలాశక్తియును మాకులమేగాని వేరుకాదు, పందినిదినిన పరదేశులువచ్చియాయిరువురుమహాపతివ్రతలను వివాహముచేసుకొని మిగుల గీర్తిపొందిరనిపలికిన,యా

చక్రవర్తి యకటా పశువునుందినెడుపంచములకంటెను గుక్కనుందినె
డుస్వపచులుహీనులు, మిగులనిషిద్ధులు, ఐననునీకన్నియమిగులసుందరి,
యెటులవివాహముచేసుకొందును, యేమిచేయుదును దైవమాయని వి
చారపడుచు విధినాథునిందూరుచు నేమియునుదోచక విచారపడుచుం
డిన, యాకన్యకామణియారాజేంద్రుని మనోసంకటమునుగ్రహించియ
తనికినమస్కరించి పుణ్యాత్మామేముమాలవారమని స్వపచులమనియో
చించవలదు, మేముకుక్కనుందినినవారమనిచెప్పితిని, అనగా అహంకా
రము లేనివారము, మాకుపితృదేవతలు ప్రత్యక్షముగాగనుపింతురు, నీ
మనోసంకటమునువిడిచి నిన్నుబంధవిముక్తునిగాజేసిన నన్నాదరించిద
యతోవివాహముచేసుకొనుమనిప్రార్థించిన, యారాజేంద్రుఁడాశ్చర్యప
డి, ఆహావీరికింబితృదేవతలుప్రత్యక్షమగుటయెట్లు, నిషిద్ధమైనకులముగా
నుండినయెడల పితృదేవతలెట్లుప్రత్యక్షమగుదురు. మిగులయుత్తమకుల
ముగానేయుండుననియోచించి, యాకన్నియయందు మోహముగల
వాడై యోకన్యకారత్నమానేను దిక్కులేనివాడను నన్నురక్షించుభా
రమునీది, నీవుండుద్వీపమునకుంబోదమనిన యాకన్నియ ప్రాణనాథా
నిన్ను దేవునిగానెంచి పూజించుచునెల్లసుఖము లనిచ్చెదను, నీవుమ
నోవ్యాకులమును విడిచి రమ్మనివెంటఁబెట్టుకొనిపోయి తనతల్లి దండ్రు
లకుంజెప్పిచూపించెను, దానిజననీజనకులు మిగులసంతసించివివాహము
గావించిరి, ఆరాజేంద్రుఁడు మిగుల గుణవంతురాలైన భార్యతోనె
ల్లసుఖములనుభవించుచు, నొకనాడుభార్యనుంజూచి, ప్రాణనాయకీ ని
న్నువివాహముచేసుకొని మైదుసంవత్సరములాయె నింతవఱకు నాకుం
బితృదేవతలదర్శనముగాకుండుటకుఁ గారణమెయ్యదియనిపలికిన, యా
కంజదళాక్షి ప్రాణనాథా దేవరవారిచిత్తమునకుంగలిగిన చాంచల్యమిం
తవరకును స్థిరపడకయున్నది, ఆచిత్తముస్థిరపడినయెడల మనకుసంతా
నముకలుగును, సంతానముకలిగినవెంటనే పితృదేవతలుదర్శనమిత్తురు
గాఁబట్టి భేదరహితమైనచిత్తముతో నుండుమనిపలికెను. ఆరాజేంద్రు
డు తనమనోభావమును గ్రహించినభార్యనుమెచ్చుకొని మిగుల య
న్యోన్యమైన మైత్రికలిగివర్తించుటంబట్టి యతని భార్యగర్భమునుధరి
యించి మొగబిడ్డనుంగనెను, చక్రవర్తియత్యంతసంతోషమునుబొంది

పుత్రోత్సవాదికార్యములనునెరవేర్చి యాబిడ్డనుయత్యంత ప్రేమతో
బెనుచుచు పిత్రుదేవతలనుదర్శించి యానందించుచుండెను,

ఇట్లుండఁగా నొకనాడా రాజేంద్రుఁడు భార్యనుంజూచి ప్రాణనా
యకీ నేనీద్వీపమునకువచ్చి నిన్నువివాహముచేసుకొని యిరువదిసంవ
త్సరములాయెను, మనబిడ్డకుపదునైదుసంవత్సరములప్రాయమాయెను
ఇంతవరకుందగుమైనవిద్యాభ్యాసములేకయున్న దెందైననొకపట్టణము
నకుంబోవుటయుక్తమనితోచుచున్నది, నీయిష్టముచెప్పుమనియడిగిన
యాయువిధయునుసంతసించిప్రాణనాథామనముండిననీద్వీపమునకుక్రిం
దిభాగముననొకగొప్పపట్టణమున్నది, దేవరవారియిష్టప్రకారమచటికిం
బోదమనిన యారాజేంద్రుఁడుభార్యయందు మిగులఁ బ్రేమగలవాఁడై
పుత్రునింబత్నినిందోడ్కొనియాద్వీపమునుదిగి, తనపట్టణమును గొలు
వుకూటమునుజూచి యద్భుతమునొందిప్రాణనాయకీ యిరువదిసంవత్స
రములకు ముందీపట్టణమంతయునగ్నిచేగాలిపోయెను, మఱలనెవరుని
ర్మించిరో తెలియదు, నాసభామంటపమును సింహాసనమునుగనుపించు
చున్నవి మనమచటికింబోయి మంగళవాద్యములు వచ్చునంతవరకు
యుందమనివారినివెంటఁబెట్టుకొనివచ్చితనసింహాసనముమీదంగూర్చుం
డి, బిడ్డనుదొడలమీదంగూర్చుండఁబెట్టుకొని భార్యనుయెదుట నిలుపు
కొనిసంభాషించుచు, నాయింద్రజాలకునిమహిమవలన నేత్రములనుదె
ఱచి,భార్యనుబిడ్డనుగానక యాశ్చర్యముతోనలుదిక్కులంబరికించుచు
తనసభికులందరినింజూచి మిగులనాశ్చర్యానందభరితుండై ,ఓ హోమి
త్రులారా నాతోనింతకుముందుభాషించుచుండిన యాభార్యయునునా
తొడలమీదనుండిన యాబిడ్డయునెందుబోయిరి, అద్యోయిది మటు
మాయముగానున్నది మీరుచూడలేదాయనియడిగిన, యాసభవారం
దఱునాశ్చర్యపడి యేమియునుబలుకకుండిరి, ప్రధమమంత్రియైన సునీ
తీప్రభువునుంజూచిరాజేంద్రా, దేవరవారునిద్రమైకముచేత నేత్రముల
నుబదినిమిషములకాలముమూసుకొంటిరి, నిద్రభంగముగావించుటకు
నోడి మేమందఱమునిశ్శబ్దముగానుంటిమి, ఇంతలోదేవరవారికి స్వప్న
ముగలిగియుండునేగాని నిజముకాదు, దేవరవారిభార్యయును బిడ్డయు
ను మనసభకెన్నఁడురాలేదనిపలికిన, యారాజేంద్రుఁడు వెఱఁగుపడిమి

త్రుఁడా నిజముగాజరిగినవర్తమానముగానికలగాదు, ఇరువదిసంవత్స ములుండియనుభవించివచ్చిన యనుభవమును నీవుస్వప్నమనిచెప్పుటెట్లు. మనకన్నులకెదుటపట్టణమంతయునుగాలి భస్మమాయెనుగదా మనమందఱము మహాప్రవాహమునంగొట్టుకొనిపోతిమిగదా, మీరెటులఁ బ్రాణములనుదప్పించుకొనివచ్చితిరి, మఱల మనపురమెవ్వరుసృజించిరి; ఆమంత్రకాఁడెందుబోయెను, జరిగినవివాదమంతయును, ఇంద్రాది దేవతలువచ్చి వివాహముగావించుటయును, ఆమాంత్రికులలోనొకఁడు వచ్చి చేసినదుర్మార్గమును మీకుందెలుసునుగదా, అందుపైనజరిగినవర్తమానమంతయునువినుఁడని సర్వము నెఱింగించిన, యాసభవారందఱు నువిని యద్భుతమునొందిరి, ప్రథమమంత్రియైనసునీతి రాజేంద్రాసర్వమబద్ధము, అంతయునుశక్తి, అనుభవముకల్ల, జరిగినదంతయుదబ్బర, నిజముగొంచెమైనను లేదు. స్వప్నమునమీకటులఁదోఁచియుండును మేల్కాంచినసర్వముదబ్బరయేమిలేదు, మనసభకుయీబీదబ్రాహ్మణుఁడుదప్ప యితరులెవ్వరునురాలేదు, మనపురమెన్నడునుగాలిపోలేదు. మహాప్రవాహములోమనముగొట్టుకొనిపోనులేదు, అంతయుసుమారుపదినిమిషములుండును, ఇంతలో మీరెన్నడుస్వపచద్వీపముననిరువది సంవత్సరములుండివచ్చితిరి, సర్వమబద్ధముస్వప్నమునమీచిత్తమునకటులఁదోచియుండుననిపలికిన,యాసభికులందరునిజముగాస్వప్నమేనని యాశ్చర్యపడుచుండిరి,అంతనారాజేంద్రుఁడుమనముప్రత్యక్షముగాననుభవించివచ్చినయనుభవమంతయును సభికులుకలయనిచెప్పుచున్నారని యోచించుచుండఁగా,నాయింద్రజాలకుఁడుప్రభువునుంజూచిరాజేంద్రా నేనుదేవరవారితోనేనింద్రజాలకుండనని చెప్పుచునావిద్యావినోదమునుజూపించితిని, అందువలన దేవరవారిసభకునొకపురుషుఁడును స్త్రీయునువచ్చివారివర్తమానమునుజెప్పుకొనుచుండిరివెంటనేవేరొకపురుషుఁడువచ్చితప్పువాదముచేసినానితోడమెదిరించియిద్దరుయుద్ధముచేసిచచ్చిరిఆసుందరీమణిమూలమాయదేవేంద్రుఁడువచ్చిదానినీకువివాహముగావించెనుద్రిమూర్తులునువచ్చిదీవించిరి. ఇరువదిసంవత్సరములుజ్ఞానశక్తితోఁగూడి బిడ్డనుంగని పితృదేవతలనుదర్శించివచ్చితివి, సర్వమునాజాలముగానినిజముగాదు స్వప్నముంగాదు, చిత్తవ్యాప్తియేగాని మీశరీరమెందునుబోలే

దని చెప్పిన, యతడద్భుతమునొంది ముక్కు మీద వ్రేలు పెట్టుకొని మ హాత్మా మఱల నీవిద్యావినోదమునుజూపుడనిన యతఁడు తనహస్తమం దుండిన నెవలియాకలకుంచెనుం ద్రిప్పి చిత్తసంకల్పమునుబొందించెను, ఆ వెంటనే ప్రభువును సభికులును నిద్రచేమైమఱచి నేత్రములనుమూసి గొప్పవెలుగునుంగాంచి, దశవిధనాదములనువిని యీవింతవాద్యము లెక్కడివనియోచించుచుండఁగా నింద్రాదిదేవతలునుమహాఋషులును వచ్చి యాప్రభువునందీవించి, పావనచరితా మహేంద్రలోకమునకు దే వరవారినిం దోడ్కొనిపోవచ్చితిమని త్వరితముగానతనిసభికులతోడవి మానముమీదం గూర్చుండఁబెట్టుకొనిపోయియామహేంద్రునిసభలో విడిచిరి, ఆచక్రవర్తిసన్మానింపఁబడిమిగులయద్భుతమైనయాకొలువుకూ టమునంగూర్చుండి యామహాత్మునింద్రిమూర్తులుసహా సభికులనుజూచి యాశ్చర్యపడుచు తనసభికులకుంజెప్పి చూపించుచుండెను, ఆమహేం ద్రుఁడు చక్రవర్తికినియతనిసభికులకును వివిధమర్యాదలుగావించి వెల లేని గొప్పదేవరత్నములను వేరువేరుగానందరికినిచ్చిసెలవిచ్చెను. వారు మగుడియావిమానమునెక్కి భూలోకమునం దమకొలువుకూటమునకు వచ్చి నేత్రములనుదెఱచి తమహస్తములంనుండిన దివ్యరత్నములను గానక, యొకరిముఖమొకరుచూచుకొనుచు దిగ్భ్రమజెంది, ఓహో మనహస్తములం ధరియించిన దివ్యరత్నములెందుబోయెనని యోచిం చుచుండిన, యాయింద్రజాలకుఁడు పుణ్యాత్ములారా మీరేలభ్రమించె దరు. ఇప్పుడైననామహేంద్రజాలమని తెలియవచ్చెనా సంశయమువిడి చెనాయనిపలికిన,యారాజేంద్రుఁడును సభికులునామహాత్మునిం బెక్కువి ధములఁగీర్తించి దివ్యవస్త్రాభరణములను గోరినవస్తువులను అగ్రహా రములనునిచ్చిపుచ్చెనని చెప్పిన, యారామచంద్రుఁడాశ్చర్యపడి, ఓహో యింద్రజాలపుకథలు మిగులయద్భుతమనిపలికిన యావసిష్ఠమహాఋ షి చిఱునగవుతోనతనింజూచిపుణ్యాత్మా, పప్పన్నమునుదినునపుడు,అం దరికినిసంతోషమే, కడుపునొప్పికలిగినప్పుడుగదా దానివిశేషమును దె లుసుకోబడునుగాఁబట్టి, అల్పసుఖమునకాశించి ఘోరమైననరకంబునం బుట్టుటవివేకముకాదు, జననమరణంబులును సుఖదుఃఖములును బంధ మోక్షములునులేని, నీనిజస్వరూపమేనిత్యమైన యచలపరిపూర్ణము,అది

యేపరమపదము,దానినింగోరుట వివేకముగాని బంధమోక్షములు త్రో
వలుభ్రమరూపకములు, భ్రమవలననే జన్మములు, భ్రమలేనివారికింబరి
పూర్ణమునకంటె యేమిలేదు, గురుకటాక్షమునుబొందిన తరువాత మఱల
తో చేటందుకు యేమిలేదు, మాయయొక్క భ్రమస్వరూపముగాంబట్టి మా
యకుజననీజనకులు లేరు, తల్లిదండ్రులు లేనిదానికి మూలము లేదుగాబట్టి
పుట్టుకయును జావును లేదు, భ్రాంతివల్లనే జననమరణములు, అన్నితిప్పలు
ప్రకృతిద్వయమునకే, ప్రకృతిద్వయమునకు మూలము లేదు, శరీరయాత్ర
లకు మూలము లేదు, గనుక కులగోత్రములు లేవు, సర్వము భ్రమ, రజ్జుసర్ప
భ్రాంతియేగాని ప్రపంచమునకును, స్వప్నమునకును, ఇంద్రజాలమునకును
భేదము లేదు, కలలో వచ్చిన శరీరములు మేల్కొంటె నొక్కటియైన లేకపోవు
నుగాంబట్టి, కలలో వచ్చిపోయెడు దేవతాస్వరూపములు సహా సమస్తమును
భ్రమరూపకములే గాని దేవుడుగాడు. దేవుడు స్వప్నమున వచ్చి మేల్కొ
నినం బోవువాడుగాడు. దేవునకు రాకపోకలు లేవు యెందును నిండి నిబిడీకృ
తమైన యచలమే దేవుడు, త్రిమూర్తులు భ్రమ. ఇంద్రాది దేవతలు భ్రమ,
మహేంద్రుడు భ్రమ, శ్రీసదాశివుడు భ్రమ, శ్రీమన్నారాయణమూర్తి
భ్రమ, అందఱును భ్రమస్వరూపులుగానే తెలియుము. "శ్లో॥ భ్రమేణాహం
భ్రమేణత్వం భ్రమేణోపాసకం జనః। భ్రమేణేశ్వర భావత్వం భ్రమమూల
మిదం జగత్" అని యున్నది గనుక సర్వము భ్రమ, భ్రమయే యెఱుక, యెఱు
కే అహంకారము, అహంకారమే జీవేశ్వరులు, అహంకారమే ప్రకృతిపురు
షులు, అహంకారమే శ్రీమన్నారాయణమూర్తి, అహంకారమే మహాలింగ
ము, అహంకారమే త్రిమూర్తులు, అహంకారమే పంచభూతములు, అహం
కారమే పంచవింశతితత్వములు, అహంకారమునకే కులములు, అహంకా
రమే నేను బ్రాహ్మణుండనని, నేను చండాలుండనని చెప్పుచున్నది గనుక, అ
హంకారమే సర్వకులములు, అహంకారము లేకుండిన కులము లేదు వృత్తి లే
దు, రాకపోకలు లేవు, రాకపోకలు లేనిదే యచలపరిపూర్ణబ్రహ్మము అదియే
పరమపదమని చెప్పిన, యా రామచంద్రుడాశ్చర్యపడి స్వామీ మునీంద్రా
ప్రపంచాది వృత్తులను విడుచుట యసాధ్యంబని పలికిన, యా మునీంద్రుడు
రాజేంద్రా! అచలపరిపూర్ణము సాధ్యాసాధ్యములు లేనిది, ప్రకృతిద్వయ
ము లేనిదిగాంబట్టి దానికి పట్టువిడుపులు లేవు, ఏకాలమందును శరీరయాత్ర

లుకాలేమ, ఇక౯నుగాబోదు,దానికియేజోలీపట్టదు ప్రపంచమునుయెఱుఁగదు,జ్ఞానములేదు,అజ్ఞానములేదు, ఉపాధిద్వయదోషరహితమైన పరతత్వముగనుకను,ప్రజ్ఞానచైతన్యములు లేవుగనుకను, దానివలనభ్రమరూపకమైనయెఱుకపుట్టనేలేమ, పుట్టించజడనులేమ.రజ్జువునందుసర్పభ్రాంతితోఁచినట్టుల, అచల బ్రహ్మమునందు ప్రపంచ భ్రాంతితోఁచుచుండును. ఎండమావులయందు నీరులేనట్టులవిచారణపరులకుం భ్రమరూపకమైన యెఱుకలేకపోవుచున్నది, యెఱుకవచ్చిన విధమునుయెఱుకపోయెడువిధమునుదెలిసిచెప్పుటకుఁద్రిమూర్తులకైనయలవిగాదు,ఈయెఱుకయందుతీపుఅధికము, మిగులరుచ్యముచిత్రవిచిత్రములకుంబుట్టిల్లు,సర్వవినోదములకుం బట్టణము,ఇంద్రజాల మహేంద్రజాలాదివిద్యలకుం బ్రపంచము,జననమరణములకుంబ్రవాహముగాఁబట్టిసర్వముభ్రమ,భ్రమకుమూలములేమ,భ్రమనువిడిపించుటకు గురుడేకారణము, ఆచార్యకటాక్షముచేతగానిభ్రమవిడువదనిపలికినయీరామచంద్రుడమృతమునొందిమునీంద్రాభ్రాంతిలేనివారికిమహిమయునుఅణిమాదిసిద్ధులునుగలిగియుండునాయనియడిగిన,యీతపోధనుడుమందస్మితముఖుండైశ్రీరామచంద్రునింజూచిపుణ్యాత్మా భ్రమలేనివారేమహిమలేనివారు. భ్రమలేనివారే,అణిమాదిసిద్ధులులేనివారు, భ్రమలేనివారేబంధమోక్షములులేనివారు,భ్రమలేనివారే వేదశాస్త్రములులేనివారు,భ్రమలేనివారేప్రపంచములేనివారు,భ్రమలేనివారేచావుపుట్టుకలులేనివారు,భ్రమలేనివారేపుణ్యపాపములులేనివారు,భ్రమలేనివారేకులగోత్రములులేనివారుభ్రమలేనివారే నామరూపములులేనివారు, భ్రమలేనివారేప్రకృతిద్వయములేనివారు, భ్రమలేనిదేయిరువదియారవపరతత్వము,భ్రమలేనిదేకేవలాత్మ, భ్రమలేనివారేఅశరీరులు, వారుసర్వకాల సర్వావస్థలయందునుసమస్త దేశములయందును సర్వలోకములయందును సమస్తవస్తువులయందునుచలించకస్వతస్సిద్ధముగానుండువారు, అంతటివారే వారినింగనిపట్టవచ్చునుగానిభ్రమస్వరూపులైనజ్ఞానులును యోగులునుభక్తులునువారినింగనిపట్టజాలరనిచెప్పిన,యీరామచంద్రుఁడువిస్మయమునొందిపావనచరితాయచలపరిపూర్ణబ్రహ్మముయేదియుంగాదనిసెలవిచ్చితిరి,ఏమియునులేనిబ్రహ్మమువలనంబ్రయోజనమెద్దియనియడిగినయీతపోధనుండిట్లనె.

రాజేంద్రా యేమియును లేక యేమియును గాక యెట్టివారిమనంబులకుం దగులక యిట్టిదట్టిదని నిర్దేశింపరాక యుండునదియే బ్రహ్మము. అట్టియచల బ్రహ్మమువలనం బొందెడు ప్రయోజనమింతయంతయని చెప్పుటకు నలవికాదు, జననమరణప్రవాహమను ఘోరమైన నరకమునుండి తొలఁగుటే ప్రయోజనము, సుఖదుఃఖములు లేనిదే ప్రయోజనము, బంధమోక్షములు లేనిదే ప్రయోజనము, ఇంతకంటెను వేరొండు ప్రయోజనమొకటి గలదా. మహాఋషులందరును సర్వము హేయమని తలంచి యుగములపర్యంతము సమాధినిష్ఠలనుగావించుటకు, యే ప్రయోజనమును నిష్ఠ చేయుచున్నారు. అందరును జననమరణప్రవాహమునుండి దొలఁగుటకే ప్రయాసపడుచున్నారు, బుద్ధిమంతులు పదవులను గోరరు జన్మశూన్యమునే సర్వజనులు గోరుదురు. ఆమహా ప్రభువు దర్శనమే జన్మశూన్యము గాఁబట్టి తననిజస్వరూపమును దెలిసిన గురుఁడు, శిష్యునినిజస్వరూపమును సాక్షాత్ చేసి చూపించక జన్మశూన్యము కలుగనేరదు గాఁబట్టి సర్వకాలసర్వావస్థలయందును సద్గురుపాదములను నమ్మి యతనికి వివిధశుశ్రూషలు చేయుటచేతగానిర్భ్రాంతిరహితముగా నేరదని చెప్పిన, యా రామచంద్రుఁ డానందభరితుండై త్రిలోకపావనుండవైన మునీంద్రా, కార్తవీర్యార్జునచక్రవర్తి దినములలో నింద్రజాలకులు వచ్చి యేమేమి వింతలు గావించిరి. ఆ జాలమంతయు నెటిగించినా భ్రాంతినిం దొలగించి జన్మశూన్యత్వమును బొందించుమని వేడిన యా మునీంద్రుం డిట్లనియె.

సగరచక్రవర్తికథముగిసెను.

——:(*):——

—*(కార్తవీర్యార్జున చక్రవర్తికథ)*—

శ్రీరామచంద్రా, తొల్లి కార్తవీర్యార్జునచక్రవర్తి తనభుజబలముచేత భూమండలమంతయును బాలించుచు, నొకనాఁడు మంత్రులును ప్రధానసామంతరాజులును విద్వజ్జనంబులును గొలువ నిండుకొలువుకూటంబునం గూర్చుండియుండగా, నాసభకు భాస్కరుండను నొక యింద్రజాలకుఁడు వచ్చి తనహస్తమందుండిన నెమలియీకలకుంచెను ప్రభువునకును బ్రహ్మమంత్రికిని జూపించి తత్సంకల్పమును బొందించెను.

ఆవెంట నే ప్రభువునకును మంత్రికిని నిద్రమైకము కలిగి నేత్రము



లనుమూసిన నిమిషమునకంతయు వారికిఁగొప్పవెలుగును యొక శృం
గారవనమునుగనుపించెను,ఆరాజేంద్రుఁడు తనమంత్రినింజూచి మిత్రుఁ
డా మింటియందు సూర్యచంద్రులప్రకాశము లేకనే యీవెలుగు యెం
దుండివచ్చెను, ఈవనమెవ్వరిదనియడిగిన యతఁడు రాజేంద్రా సూర్య

చంద్రులకాంతులకుమించి యిందుందురత్నములే ప్రకాశించుచున్నవి, ఈశృంగారవనములోనేమేమివింతలుండునో దెలియదు,ఆహా యిది దేవ వనముగానుండునని చెప్పిన యారాజేంద్రుఁడు చెలికాడా నీమాటలునిజ ముగానుండును,మనమావనమధ్యమునకుంబోయి చూతమురమ్మనియా యిరువురుంబోయి యందుఁదుగివ్యఫలకుసుమములనుజూచి తామెన్న డునువినితినియెఱుంగమనియాఫలములనుగోసిభక్షించి వాటిమాధుర్య మునకునద్భుతమునొందుచు,మనభాగ్యమేభాగ్యము, ఇట్టిదివ్యవనమును జూడగంటిమనియొకరితోనొకరు చెప్పుకొనుచు,జలాపేక్షులై పోయియా వనమధ్యభాగంబునబంగరుకమలములతోఁనొప్పెడుసరస్సునఁతొమ్మిదివి ధములైన సోపానములను, అష్టకోణములయందును రవి చంద్రులవలె వెలుఁగుచుండెడు దివ్యరత్నములనుజూచి ముక్కులమీదవ్రేళ్లుపెట్టుకొ నియాశ్చర్యపడుచు, నాకొలనిలోఁదిగి దాహమార్చుకొని దివ్యకుసుమ ములనుండి గుప్పుగుప్పునగుప్పెడు సుగంధతావినాఘ్రాణించుచు, నొక విశాలమైన చలవరాతి బండమీఁదంబరుండి సుఖనిద్రజెంది లేచి, యా ప్రభువు · మంత్రినింజూచిమిత్రుఁడా దీనికింబూర్వపుదిక్కున నొకమం టపముగనుపించుచున్నదిదానిదగ్గిరకుంబోయి,యందుండు వింతలనుజూ చివిచారింతమురమ్మనియాయిరువురామంటపము దగ్గిరకుంబోయి యం దుశ్రోత్రములకానందముగాదివ్యవాద్యములరవములనువిని మిగులసం తసించి, యామంటపములోనికింబోయి యందొకరత్నపీఠమునం గూ ర్చుండి దివ్యవాద్యములనుజేయుచుండిన, దివ్యసుందరీరత్నమును దాని చుట్టును వెలుఁగుచుండిన దివ్య రత్నములను గాంచి యాశ్చర్యపడు చు నారాజేంద్రుఁడు, ఓహోసుందరీరత్నమా నీవెవ్వరిదానవు యొం టరిగా నీమంటపములో నుండుటకుంగారణమేమనియడిగిన యాకన్ని య రాజేంద్రా నేనుదేవకన్నియను. త్రిలోకభ్రమయనుకన్యకామణికిం జెలికత్తియను, నేనుదేవకన్నియనగుటంజేసి నాకుభయమును క్షుత్పిపా సలును సుషుప్తియునులేదు, నాదొరసానియాజ్ఞప్రకారమిచటవాద్యము లనుజేయుచుందును, నీవృత్తాంతమంతయు వినుపించుమనిన యతఁడు దనవర్తమానమంతయు నెఱిగించి పుణ్యాత్మురాలా, ఆత్రిలోక భ్రమ యెవ్వరు, ఆనాతిమణివృత్తాంతమేమి దానితల్లిదండ్రులెవ్వరు సర్వముద

యత్తో నాకువినుపించుమనివేడిన యాయిందుముఖియిట్లనియె.

రాజేంద్రా! ఆశ్చర్యదేశమునకుంబ్రభువైన మహేంద్రుఁడనుదేవోత్తముఁడు త్రిభువనములకుంజక్రవర్తియై వినోదపురమును దనకు రాజధాని గాఁజేసుకొనిపాలించుచున్నాఁడు,అతనికింద్రిలోకభ్రమయను బుత్రికారత్నముజన్మించెను, ఆకన్నియకు మేము వేవురుచెలికత్తియలున్నాము, మాకందరికినిట్టిమంటపములువేయి తనమేడయొద్దనుండియింతవరకును నిర్మింపఁబడియున్నవి, ఆలతాంగి తనమేడయొద్దనుండి శృంగారవనమునకుంబ్రతిదినము పంద్రెండుఘడియలకు జలక్రీడార్థముగావచ్చును, అప్పుడు మేమందఱమునుగూడికొని దివ్యవాద్యములను జేయుచుందుము, రాత్రి పంద్రెండుఘడియలకు మేమందఱము దానిమేడకుంబోయి వివిధవేడుకలుసలుపుచు, నరుణోదయమున కంతయువచ్చి మామంటపములలోనుందుమని సర్వము నెఱిగించెను, ఆరాజేంద్రుఁడు తన మనంబున దీనిసుందరమేచపలచిత్తమును బొందించుచున్నది, దీనిదొరసాని యెంతటిసుందరమును గలిగియుండునోయని వితర్కించి, యారాజపుత్రినింజూడగోరి, మఱునాఁడుదయమునలేచి రెండవ మంటపముయొద్దకుంబోయి యందుండువింతలనుజూచి యద్భుతమునొంది తనమంత్రితోనోమిత్రుఁడా, తొలిజన్మమున మనమేమితపంబుగావించితిమో తెలియదు, ఇటువంటిదివ్యమంటపములను జూడఁగంటిమని చెప్పుచు,నామంటపముచుట్టును నుండువనములోని ఫలములను గోసి భక్షించుచు దినమునకొకమంటపమునుగడచి యాయిరువురుంబోవుచుండిరి.

ఇంతలోనక్కడామహేంద్రుఁడు తనపుత్రికి వివాహముచేయయత్నించి తనకొలువుకూటమునకుఁ త్రిమూర్తులను, ఇంద్రాదిదేవతలను, మోక్షాదిపదవులనుబొందినపుణ్యపురుషులనుబిలిపించితనపుత్రినిరప్పించి యమ్మా వీరిలోనీకిష్టమైనవరునింగోరుమనిచెప్పిన, యాకన్నియ నేనుయోచించిచెప్పెదనని, వారిరూపపటములను వ్రాయించి యాపటములనుంబుచ్చుకొని తనమేడకుంబోయి యాపటముల నన్నింటిని నిలిపి తనసహస్రచెలికత్తియలకుం జూపించిచెప్పెను, వారిలోఁ గొందఱు చెలికత్తియలు యమ్మా రాజపుత్రికారత్నమా! మేముభూలోకచక్రవర్తినింజూచియున్నాము, అతనింజూచినకన్నులనీపటములనుజూచినమాకుమిగుల

హీనములుగానున్నవి, అతఁడునీయందభిలాషతోఁదనమంత్రితోఁడం బ్ర
తిదినము నొక్కొక్కమంటపమునుదాటి వచ్చుచున్నాఁడని చెప్పిన,యాక
న్యకామణిపులకాంకితదేహియై యాచక్రవర్తికితానుయెదురుగాఁబోయి
యందొకమంటపములోనతనింగాంచిన, యామండలాధిపతియు నతని
మంత్రియుఁ గ్రొక్కారుమెఱుంగు తెఱంగుననాయిందుముఖి తళుక్కు
సమెఱసినంజూచి యాయిరువురు నేత్రములనుమూసుకొని నిశ్చేష్టితు
లై భూమిమీఁదఁబడిరి, ఆకన్యకామణియాచక్రవర్తినింజక్కఁగాఁజూచి
యతనిరూపపటమునువ్రాయించి పుచ్చుకొని తనతండ్రిమేడకుంబోయి
చూపించి చెప్పెను. ఆమహేంద్రుఁడును సమ్మతించి చతురంగబలముల
తోఁడ నతనికి నెదురుగావచ్చుచుండెను. ఇంతలో నామంటపమందుండు
చెలికత్తియ యాయిరువురిమీఁదనుబన్నీరుచల్లి లేవదీసి, యారాజేంద్రు
నింజూచి పుణ్యాత్మా నీభాగ్యమేమని చెప్పవచ్చును, మారాజపుత్రియైన
త్రిలోకభ్రమ నిన్నువివాహముచేసుకొనుటకు సమ్మతించి నీరూపపటము
నుంగొనిపోయి తనతండ్రికింజూపించి చెప్పెను. ఆమహేంద్రుఁడు త్రి
మూర్తులును, ఇంద్రాదిదేవతలును దన్నుగొలువగాఁజతురంగబలముల
తోఁడ నీకెదురేగి వచ్చుచున్నాఁడనిచెప్పిన, యారాజేంద్రుఁడు మిగు
లసంతసించి యోపుణ్యాత్మురాలా నీవుచేసినయుపకారమునకునేనేమిప్ర
త్యుపకారము సేయనేర్తును, నీవు నామంత్రినివివాహముచేసుకొనుటకు
సమ్మతించుమనిన, యాకన్నియమంచిదని యారాజేంద్రుని శృంగారభూ
షితునిగాఁజేసెను, అంతనామహేంద్రుఁడు మంగళవాద్యములతోఁడవ
చ్చి తనకునమస్కరించిన భూలోకచక్రవర్తినింగీర్తించి దివ్యవిమానము
మీఁదంగూర్చుండఁబెట్టుకొనిపోయిశుభముహూర్తంబునతనపుత్రిఁజక్ర
వర్తికిని చెలికత్తియనుమంత్రికినిచ్చి వివాహమహోత్సవముగావించె
ను. ఆరాజేంద్రుఁడాత్రిలోకభ్రమనుంగూడివివిధసుఖములనుభవించుచు
నూతనవస్త్రాభరణములను ధరియించుచు, నూతనపదార్థములను భుజి
యించుచు,నామేడలోని వినోదములకునద్భుతమునొందుచుండెను. మం
త్రియును దనభాగ్యతోఁడసుఖించుచు నెల్లవినోదములను వేడుకలనుగా
వించుచుండెను.

ఇట్లుండఁగా నామంత్రియొకనాడు ప్రభువునుంజూచిరాజేంద్రా

మనమీలోకమునకువచ్చి పదునైదుసంవత్సరములాయెను, ఇందుండు సుఖానందముచేత సర్వమునుమఱచియుంటిమి, ఇంతటనైన మనదేశమునకుంబోవుటయుక్తము, లేనియెడల లోకులవలన నిందింపఁబడుదమనిచెప్పిన, యామండలాధిపతిమిత్రుఁడా కలంతకాలముమనలోకమున యనుభవించెడు యనుభవమిచట యొకదినమునకు సమానముగాదు. ఇట్టిమహదానందసుఖములనువిడిచి యెట్లుపోనేర్తుమనిన, యామంత్రిపుణ్యాత్మా వేవరవారు దీర్ఘాలోచనజేయకుండిన మనకు నపఖ్యాతి సంభవించుననిచెప్పిసమాధానపఱచెను. ఆమండలాధిపతిమంచిదనిసమ్మతించి యామహేంద్రునిసముఖమునకుంబోయి తనయభీష్టమునుజెప్పిన యావంధ్యాసూనుఁడుఁ గొంతసేపువిచారపడి, యల్లునినాలింగనముచేసుకొని పుణ్యాత్మా నీయుద్దేశమునకుంగారణమేమనియడిగి తెలుసుకొని యతనికిదివ్యరత్నకిరీటాదియాభరణములన్నియునుధరియించి, దివ్యవిమానముమీఁద తనపుత్రిని యల్లుని, మంత్రినియతనిభార్యనుగూర్చుండఁబెట్టిసెలవిచ్చెను, ఆరాజేంద్రుఁడావిమానమునుమెల్లగానడిపించుకొనిభూలోకమునకువచ్చి తనపురికివెలుపలందిగి మంగళ వాద్యములును ముత్తయిదువులువాహనములునువచ్చి పురిలోనికివెంటఁబెట్టుకొనిపోవునటులముందొకభటునిచే దెలియపఱచి, వాటికియెదురుచూచుచునామాంత్రికుని మహిమవలన నేత్రములనుదెఱచి తమ భార్యలనుగానక దిగులుపడి నలుదిక్కులుపరికించుచు నాసభికులనుజూచి, ఓహోమిత్రులారా మాతొడలమీఁదంగూర్చుండియుండిన మాభార్యలెందుబోయిరనియడిగిన, యాసభవారుయాశ్చర్యపడియిదియేమివింతకార్యము, మీభార్యలెన్నడునుయీకొలువుకూటమునకురాలేదు, వారెప్పుడు వచ్చి మీతొడలమీఁదంగూర్చుండిరి, అంతయునబద్ధము, మీరిరువురు సుమారుమైదునిమిషములకాలము నేత్రములనుమూసితిరి, ఇంతలోఁనెంతటిస్వప్నమునుగంటిరోఁజెప్పుఁడనిన, యామండలాధిపతియును మంత్రియును, ఓహోమిత్రులారా స్వప్నముకాదు, నిజముగామేమనుభవించివచ్చినయనుభవముగాని కలకాదు, నిజమనిజరిగిన వృత్తాంతమంతయునుజెప్పి యావేవకన్నియలనిమిత్తముగావ్యసనపడుచుండిరి. ఆయింద్రజాలకుఁడుఁదన్నెఱింగించి, పుణ్యాత్ములారా నేనునాయింద్రజాలమును

గావించితిని, అందువలనమీచిత్తములట్టులవ్యాపించెనేగానియనుభవ మేమియునులేదు, మీశరీరములిందుండియెందునుంబోలేదు, సర్వము నామాయగానినిజముకాదు స్వప్నముంగాదు,ముందుమీరుధరియించి నవస్త్రాభరణము లేగాని, మహేంద్రుడిచ్చిన దివ్యవస్త్రాభరణములు గావని వారియెదుటనిలువుటద్దమునునిలిపిరి. ఆయిరువురు నొకరిము ఖ మొకరుచూచుకొని ముక్కులమీద వ్రేళ్లుపెట్టికొని యాశ్చర్యపడి యాయింద్రజాలకునింజూచి మహాత్మా నీమహిమవలన యద్భుతానం దసుఖములనుభవించివచ్చితిమి,యింకొకనారి మాకునీజాలమునుజూపు మనిన యతఁడుమంచిదని సెలవియాకలకుంచెను బభ్రువునకుంజుట్టి చి త్తసంకల్పమునుబొందించెను

ఆవెంటనే యారాజేంద్రునకునిద్రమైకముగలిగి నేత్రములను మూసిననిమిషమునకంతయు నామండలాధిపతికి వివిధతఘకులును గొ ప్పవెలుగును, ఒకవిదేశీయుఁడుమిగులధావళ్యమైమహారమ్యమైన యశ్వ మునుదెచ్చినంజూచి యీయశ్వమెవరిదనియడిగెను. అతఁడురాజేంద్రా యిది మిగులశ్రేష్ఠమైనగుఱ్ఱము,దేవరవారిచిత్తవృత్తినింతెలిసిమెలఁగు నట్టులసాధకపఱచియున్నాను, దీనివెలనాకుంతెలియదు, ఏలినవారుదీని నెక్కిసవారీచేసినపిమ్మట నాకేమియిప్పించినను బుచ్చుకొందుననిపలికిన యారాజేంద్రుఁడు తనసింహాసనమునుండిలేచి తనకుడిహస్తముతోదా నిదేహమునుదడివితన కాశనుబిగించికట్టికిరీటముజుపడకుండునట్టులముకు టమునుగట్టిగాఁగట్టుకొనియాతురగమునెక్కికూర్చుండెను. ఆమాయా తురగము చిత్రగతులభూమి మీదందిరుగుచు తనరెక్కలనువిదిలించు కొని యుప్పరవీధికెగసి వాయువేగముగాఁబోవుచుండెను, ఆగుఱ్ఱము యొక్క వేగమునకు యారాజేంద్రుఁడు భయాశ్చర్యములును బ్రాణభీ తియునుఁబొంది, ఓహో దైవమానేఁడీయశ్వము నన్నంతమునొందించు నట్టులయున్నది, ఇట్టిసమయమునసీవుతప్ప నాకువేరేరక్షకులులేరని ప రమాత్మునింధ్యానించుచు మెలుగెత్తియేడ్చుచుకళ్లెమును బిగియంబట్టు చు విధినాథునిందూఱుచుండెను, ఆమాయా తురగముప్రభువుభయప డుటను గ్రహించి తనవేగమునుమట్టుపఱచి పోయిపోయి యందొకద్వీ పమునుజేరెను. ఆరాజేంద్రుఁడు త్వరితముగానాయశ్వమునుదిగి,అబ్బా

పునర్జీవితుండనైతినని కొంతమట్టుకుసంతసించి యాగుఱ్ఱమునుజూచుచుండఁగానే యది మటుమాయముగాఁబోయెను.

ఆమండలాధిపతియాశ్చర్యపడి ఆహా యిదియేమి వింతకార్యము, అశ్వమెందుఁబోయెనని యోచించుచు సూర్యకిరణములకుండాళఁజాలక యందొక కపిత్థవృక్షముక్రిందఁగూర్చుండి, ఓహోయిదియేలోకమో, యేదీవియో తెలియదు, ఇందుండుభూరజమంతయునుసువర్ణమువలె తళతళమెఱయుచున్నది, ఇందుండురాళ్లన్నియునురత్నములవలెఁబ్రకాశించుచున్నవి, క్షుత్పిపాసలనుభరించుటదుస్తరముగానున్నదని, యాచెట్టుక్రిందరాలినవెలగపండ్లనుంగొట్టిభక్షించుచు దూరముగానొకపట్టణమునుజూచి, యాపురిలోదేవతలుందురో లేకరాక్షసులుందురోయనివితర్కించుచునొకనారీమణింగాంచి యోపుణ్యాత్మురాలా నేను భూలోకచక్రవర్తిని దారిఁదప్పి యీద్వీపమునకువచ్చితిని మిగులఁదప్పిగొనియున్నాను, ఈద్వీపమెయ్యది, ఆపురమునకుంబేరెయ్యది, పాలించువారెవ్వరు జలములుండు చోటెయ్యదియనియడిగిన యాపడతుకయతనికినమస్కరించి స్వామీ! ఇది సంకల్పమను ద్వీపము, అదివికల్పమనుపట్టణము, భ్రమాదేవియను మతంగకన్యకామణిధర్మయుక్తముగారాజ్యమునుఁబాలించుచున్నది. ఆకన్యకామణిసుందరలావణ్యవిశేషములను జెప్పుటకుఁ బ్రహ్మేంద్రాదులకైనయలవిగాదు, పురిలోనందప్ప మీకెందునునీళ్లుదొరకవు, నీవయోరూపలావణ్యములనుజూచిమారాణినిన్నువరియించునని తోఁచుచున్నది. పూర్వజన్మమున నీవెట్టితపంబుగావించితివో తెలియదు నీభాగ్యమేభాగ్యమనిపలుకుచుండఁగా, నాభ్రమాదేవిశృంగారభూషితురాలై, యాణిముత్యములకుచ్చులు వ్రేలాడెడు నవరత్నఖచితమైన యపరంజిపల్లకిలోఁగూర్చుండి పట్టపుటేనుఁగునుశృంగారించి వెంటఁబెట్టుకొని మంగళవాద్యములతోడ మూడు వేలస్త్రీలువివిధాయుధములనుధరియించి బరాబరులుసేయుచుముందు నడువఁగాఁ గొందఱుముద్దియలు ఛత్రచామరములు వేయుచువెంబడిరాఁగా, నాయువతీమణియాప్రభువునుంజూచిరాజేంద్రామాభ్రమాదేవికి భూతభవిష్యద్వర్తమానములను దెలియును. దేవరవారువచ్చిన సమాచారమెఱింగి వచ్చుచున్నదని చెప్పుచుండఁగా, నాకన్యకామణియ

తనిదగ్గరకువచ్చి పల్లకిదిగినంజూచి యారాజేంద్రుఁడుదానిరూపమునుఁ జూడఁజాలక నేత్రములనుమూసుకొని భూమిమీఁదంబడెను, ఆకన్నియ యతనిముఖముమీఁదం బన్నీరుచల్లి లేవదీసి కూర్చుండఁబెట్టి రాజేంద్రా! లేవరవారుమూర్ఛిల్లుటకుఁగతంబెద్యది, నాదేహకాంతులకేమూర్ఛిల్లితిరో, లేకమతంగకన్నియయని మనంబొప్పక సొమ్మసిల్లితిరో, ఇందుండు సువర్ణమును రత్నములనుజూచి భ్రాంతిచేసొమ్మఁబడితిరో నిజము చెప్పుఁడు, సుగుణసంపత్తి యేవిశేషార్థముగాని కులరూపములు విశేషార్థములుగావు, ఏకులజుండైనను బ్రహ్మజ్ఞానముచేతఁ బ్రాహ్మణుండగును, మీకులగురుండైన వసిష్ఠమహాఋషి మాజాతికన్నియయైన యరుంధతిని వివాహముచేసుకొని త్రిలోకపూజ్యుండుగాకుండెనా, మీరేలభేదమెంచెదరు నేనుఁద్రికాలజ్ఞానిని, నావలనమీకుఁగీర్తియును యశస్సును ఆయుర్వృద్ధియును మోక్షమునుగలుగుటకుసందియములేదు. మీరుసంశయింపక ముఖమెత్తినన్నుంజూడుఁడనిన, యామండలాధిపతికి మనోసంశయమువిడువక ముఖమెత్తియాకన్యాముఖంబుంజూచినేత్రములనుమిఱుమిట్లుకలిగి నిలువనోపకమగుడ భూమిమీఁదవ్రాలినంజూచి, యాలలనామణి మరల యతనిలేవదీసి యతనికంఠమునదివ్యరత్నాభరణముంచియాపట్టపుటేనుఁగుమీఁదం గూర్చుండఁబెట్టి తానుఁబల్లకిలోఁగూర్చుండిమంగళ వాద్యములతోడం బురిలోనికిఁ వెంటఁబెట్టుకొనిపోవుచుండెను.

ఆరాజేంద్రుఁడు తనమనంబున, అకటా విధాత యిట్టిజగన్మోహినిని మతంగకన్నియఁగానేల సృజించెను. ఆహాదీనిసుందరరూపమునకు సరియైనస్త్రీలు యేలోకమందునుయుండరు. దేవగంధర్వయక్షకిన్నరస్త్రీలు దీనిపాదరేణువుకుసరిరారు. దీనితోభోగించనివానిజన్మమెందుకు. ఈలతాంగివలనంగలిగినచండాలత్వమును తపోసిద్ధివలనంబాపికొందును. వేశ్యాకొమరుఁడును మతంగమహాఋషికి యగ్రజుండును నైన వనగురుఁడు తపోసిద్ధిచేత నిర్దోషియై త్రిలోకపూజ్యుఁడుగాకుండెనా, గార్ధభమునకుంబుట్టిన గార్గేయమహాఋషితపస్సువలనం బూజ్యుఁడుగాకుండెనా, చాకలదానికింబుట్టిన నారదమహాఋషి బ్రహ్మజ్ఞానమువలనం ద్రిలోకపూజ్యుండుగాకుండెనా, కులము వలనఁబ్రయోజనములేదు, మతంగకన్ని

ఇదినీభార్యయగుటసత్యము, ఈబిడ్డలునీకుంబుట్టినబిడ్డలు, శామసించక
గ్రహించుమనిచెప్పి యదృశ్యుండాయెను· అంతనామండలాధిపతికి యే
మియునుదోచక కొంతసేపటికియోమాదిగదానా, అగ్నిదేవుఁడుతప్పు
సాక్ష్యముచెప్పిపోయెను, నేనుదేవతలకైననుభయపడువాఁడనుగాను, ప్రా
రబ్ధకర్మమనియెంచి నీబిడ్డలతోడనీద్వీపమునకుంబొమ్ము, అనుభవమెవ్వా
రికినిందప్పదు, నన్నునిందించవలదు పోపొమ్మనిపలికిన యామాయలాడి
ప్రాణనాథానన్నిటులవంచించుటఁదగునా, అగ్నిదేవుఁడుతప్పుసాక్ష్యము
నుజెప్పినను, త్రిమూర్తులైనను వచ్చి నిజముచెప్పరాయనిపలికినమాత్రము
ననే దివ్యవాద్యములరవములతోడ నాముప్పురుమూర్తులును ప్రత్యక్షం
బైనంజూచి యారాజేంద్రుఁడుభయభ్రాంతుడై వారికిసాష్టాంగదండం
బులిడినవారుదీవించి, ఓహోరాజేంద్రా! ఈభ్రమాదేవిచండాలకుల
మునంబుట్టినదనియోచించవలదు, మిగులయుత్తమురాలు, ఆత్మధ్యా
నపరాయణులైనవారెవ్వరైనను మాకుసమానులుగాని కులమెంచు
వారముగాము, కులములన్నియును శుక్లశోణితసంబంధములైయున్నవి
గాఁబట్టి విధినిషేధములులేవు, ఆలస్యముచేయకగ్రహించుమనిన, య
తఁడుస్వాములారా నాసభికులనందరికినిప్పుడుచక్కగాఁదెలియవచ్చెను.
మీదర్శనముచేతధన్యుండనైతినని వారినింబెక్కువిధములవినుతించిన
మస్కరించెను. ఆముప్పురుమూర్తులునదృశ్యులైరి. అంతనారాజేంద్రుఁ
డు భార్యనుబిడ్డలనుదగ్గరకుంబిలిచి ప్రియురాలా మనరహస్యముయీస
భికులకందరికిందెలియఁగోరి యింతదూరమునిన్నుంబరీక్షించితి, నిప్పు
డుత్రిమూర్తులువచ్చిచెప్పగా నందరికినిర్దోషులనిదెలియవచ్చెను. నీవునా
యందసూయతనుబొందకుమని ప్రియవచనములచేతనూరడించి బిడ్డల
ను ముద్దులాడి వారినందరినివెంటఁబెట్టుకొనిపోయి యందొకమంటప
ములోనిలిపి మీరిచటనేయుండుఁడు, పుణ్యస్త్రీలును మంగళవాద్యము
లునువచ్చుననిచెప్పి మగుడికొలువుకూటమునకువచ్చి సింహాసనముమీఁ
దంగూర్చుండి, ఇంద్రజాలకునిమహిమవలన నేత్రములనుదెఱచి సభికు
లనుజూచిమిత్రులారా త్రిమూర్తులును, అగ్నిదేవుఁడును ప్రత్యక్షమైభ్ర
మాదేవి మహాయుత్తమురాలనియును గుణశ్రేష్ఠురాలనియును దాని
నిగ్రహించుట చేతనీకుదోషముకలుగ నేరదనియునుదీవించిచెప్పిపోయి

నసమాచారములన్నియును మీకు దెల్లమిగా దెలిసియున్న విగదా, ఐనను
మనము పెద్దలనురప్పించికొంతమట్టుకు ప్రాయశ్చిత్తమును గావించుకొనుట
యుక్తమనినాకుతోచుచున్నది, మీయందరియభిప్రాయములను జెప్పుడ
నియడిగిన యాసభికులందరు ప్రభువునిదానమునుదప్పి యేమేమోమా
ట్లాడుచున్నాడని యొకరిముఖ మొకరుచూచుకొనుచుండిరి.

ప్రథమమంత్రియైనసునీతి ప్రభువునుంజూచిరాజేంద్రా దేవర
వారుయేమేమోజెప్పితిరి, అవిమాకేమియును దెలియలేదు, అదేమివృ
త్తాంతమో సాంగముగావినుపించుడనివేడిన యామండలాధిపతి జరిగి
నవృత్తాంతమంతయును జెప్పిన యామంత్రియును, అసభికులునుముక్కు
లమీద వ్రేళ్లుపెట్టుకొని యద్భుతమునొందిరి. మంత్రిరాజేంద్రా దే
వరవారునేత్రములనుమూసుకొని యైదునిమిషములాయెను. ఇంతలో
మీరెన్నడుసంకల్పమును ద్వీపమునకుంబోతిరి. వికల్పమును బట్టణమును
బాలించెడు భ్రమాదేవియనెడు మతంగికన్నియను మీరెన్నడువివాహ
ము చేసుకొంటిరి. అచటయిరువదిసంవత్సరములుండి యేడ్గురుబిడ్డలనెన్న
డుగంటిరి. ఆభ్రమాదేవియును బిడ్డలును మనసభకెన్నడువచ్చిరి. అ
గ్నిదేవుడును త్రిమూర్తులును ప్రత్యక్షమై యెప్పుడుదీవించిపోయిరి. స
ర్వమబద్ధము. అంతయునుశక్తి. జరిగినదించుకైనను లేదు దేవరవారికిస్వ
ప్నమువల్లనో, లేక యీయింద్రజాలకుని మహిమవల్లనో యటులదోచి
యుండుననిచెప్పిన యారాజేంద్రుడు మిత్రుడా స్వప్నముగాదు' ఇం
ద్రజాలముంగాదు, నేనుయిరువదిసంవత్సరములుండి యనుభవించివ
చ్చినప్రత్యక్షమైనయనుభవమును నీవుయుశక్తి యనిచెప్పెదవేల, చలవ
రాతి మంటపములోనాభ్రమాదేవియును దాసిబిడ్డలునున్నారు, నీవు
పోయినారినింజూచిరమ్మనిన యతడుపోయిచూచియెవరినింగానకవచ్చి
చెప్పిన యామండలాధిపతి ఆహాయిదియేమివింతకార్యము, యింతకు
ముందుగానామంటపములోనిలిపివచ్చితినే, ఇంతలోవారెందుబోయిరని
యోచించుచుండగా, నాయింద్రజాలకుడు ప్రభువునుంజూచి రాజేం
ద్రాసర్వము నాజాలమువలనంగలిగినచిత్తభ్రమయేగాని యదినిజము
కాదు, స్వప్నముంగాదు, అనుభవమంతయును శక్తి, జరిగినదంతయుద
బ్బర సర్వముభ్రమయనిపలికిన యారాజేంద్రుడుముక్కుమీదవ్రేలు,

పెట్టుకొని యతనింబెక్కువిధములవినుతించి మహాత్మా యత్యద్భుతమై నయింద్రజాలముయత్యానందమును,బుట్టించుచున్నది,వేరొకజాలమును జూపుడనిన యతఁడు పుణ్యాత్మా తొలుతనేజూపించినది మహేంద్రజాలము, ఇప్పుడుచూపించినది యింద్రజాలము.కనుకట్టువిద్యయైనజాలము నుజూపించెదనని చెప్పియాయింద్రజాలకుఁడుతనచేతిలోనినెమలియీకల కుంచెను సభవారికందరికినింజుట్టి చిత్తసంకల్పమునుబొందించెను.

అంతనాసభకు నొకముసలిబ్రాహ్మణుఁడునుసుందరమైనస్త్రీయు నువచ్చియారాజేంద్రునింజూచియావృద్ధుడుపుణ్యాత్మా నేనునాభాగ్యవశమున రాక్షసులనుదప్పించుకొనివచ్చి దేవరవారికొలువుకూటమునుప్రవేశించితిని,నేనురక్కసులకుంభయపడువాడనుగాను.నేనుదివ్యాస్త్రశస్త్రకోవిదుండను నాయొద్దదివ్యాస్త్రములుమెండుగాగలవు, రాక్షసమాయలననాకుఁదెలుసును, ఇదినాభార్యమిగులగుణవంతురాలు రూపసియగుటంజేసి యీమదురాత్ములుయేమికీడుగావింతురోయనుభయముచేతపరుగునవచ్చిచేరితిమి, ఆదురాత్ములకు నాప్రభావము తెలియదునేనుగడియలోపలనందరినింజంపివచ్చెదను. అంతవరకునాభార్యనుగాపాడవలయుననిప్రార్థించి చేతిలోనిపుస్తకమునుభూమిమీదంగొట్టి రథమునుధ్వములను ధనుర్బాణములనురప్పించి, యారథముమీదంగూర్చుండి ధనుర్బాణములనుధరియించి కూతలార్భాటములనుజేయుచు నారథముతో డమింటికెగసిపోయెను. ఆరాజేంద్రుడును సభికులును బ్రాహ్మణునియద్భుతపుశక్తికిమిగులయాశ్చర్యమునుబొందిచక్రవర్తియాబ్రాహ్మణునింగాపాడుటకుఁదగినబందోబస్తుగావించెను.మింటియందు మిక్కుటములైనకూతలార్భాటములును ధనుష్టంకారములును గర్జింపులును ప్రతాపవచనములును వినవచ్చినందునయాసభికులందరుభయపడి రాజేంద్రామనకును యుపద్రవములు కలుగునటులఁ దోచుచున్నది, ధనుర్బాణములనుధరియించి జాగ్రతతోనుండుట యుక్తమనియందరునుధనుర్బాణములనుధరియించిరి. అంతటమింటిమీదినుండి రక్తమును గండలును దలలును మొండెములునుబడుటనుజూచి యాప్రభువును సభికులును బ్రాహ్మణుఁడుముసలివాడుగానుండినను మిగులసమర్థుఁడురాక్షసులతలలునరికినరికిపడఁద్రోయుచున్నాఁడనియాశ్చర్యపడుచుండగా,నాబ్రాహ్మ

ణుని శిరస్సును గాత్రమును భూమిమీదంబడెను. అవిచూచిప్రభు వును సభికులునువిచారపడుచుండగానాబ్రాహ్మణి వికలము లైపడిన తన భర్తశిరమును మొండెమునుజూచివిలపించుచు, నామండలాధిపతినింజూచి పుణ్యాత్మానాభర్తశత్రువులచేతహతమై భూమిమీదంబడెను. పతితోఁఢ సతికిగమనమని శాస్త్రప్రసర్థముగనుక నాకు సహగమనమునకు సెలవిండనియడిగెను. ఆరాజేంద్రుఁడువలదని యెన్నివిధములజెప్పినను యాబ్రాహ్మణివినక నేనొకనిమిషమైనను జీవింపనోపననిపలికి యగ్నిగుండమునుగావించుకొని యగ్నిదరికొలిపి భర్తశిరమును గాత్రమును బడవైచి తానును యాయగ్నిగుండమునంబడికాలిభస్మమాయెను, ఆ రాజేంద్రుఁడునుసభికులును విస్మయమునొంది, ఓహోయిదియేమివింత కార్యము మనభాగ్యవశమున నీమహాపతివ్రతను జూడగంటిమని యాలతాంగినింగీర్తించుచుండిరి.

అంతం గొంతసేపటికి యాబ్రాహ్మణుఁడు ధనుర్బాణములనుధరియించివచ్చినంజూచి, యారాజేంద్రుఁడునుసభికులును వెఱఁగుపడినిశ్చేష్టితులైరి. ఆమాయకుఁడురాజేంద్రాపెక్కండ్రుఘోరరక్కసులనుహతముచేసివచ్చితిని, హతశేషులుభయపడి పరుగుబారిరి.నాభార్యనుయెక్కడదాచితిరనియడిగిన, ప్రధమమంత్రియైనసునీతి యతనింజూచి యోబ్రాహ్మణుఁడాభూమిమీదంబెక్కురక్కసులతలలునుగాత్రములుంబడెను, అవిచూచి యాశ్చర్యపడుచుండగా నీతలయును గాత్రమును బడుటను మేమందరమునుజూచి వ్యసనపడుచుంటిమి. నీభార్యనేనొకనిమిషమైనజీవింపననిపలికి మేమెంతజెప్పిననువినక యగ్నిగుండమునుగావించి యగ్నిదరికొలిపి నీశిరమునుగాత్రమునుబడవైచితానునుయాయగ్నిలోబ్రవేశమయ్యెననిజరిగినవర్తమానమునుజెప్పిరి. ఆబ్రాహ్మణుడకటాయిదియేమి యన్యాయము, నాతలయెనుడొక్కయునుభూమిమీదంబడుటెట్లుయాబ్రాహ్మణినాశిరమునుగాత్రమునుఅగ్నిలోబడవైచితానుంబడుటెట్లు,మగుడినేనుజీవించివచ్చుటయెట్లు, మీమాటలు గడువింతలుగానున్నవని భూమిమీదంబడివిలపించుచుకొంతవడికిలేచియాప్రభువునుసభికులునెంతదూరముచెప్పిననువినక యాబ్రాహ్మణుండునుయాయగ్నిగుండములోని యగ్నినిదరికొలిపియాయగ్నిలోదుమికి కాలి భస్మమాయెను, ఆరా

జేంద్రుఁడిట్టిఘోరకృత్యము మనకెదుటసంభవించెను, మిగులయుత్తములైన నీవధూవరులిద్దరు నగ్నిలోనంబడిదహించిరి.ఇందుకుమనమేమిచేయుదమని సభికులతోడ నాలోచించుచుండఁగానాయగ్నిగుండములోనుండి శ్రవణానందముగాదశవిధవాద్యములును వినవచ్చినయాశ్చర్యముతోనాప్రభువుసభికులునాయగ్నిగుండమునేజూచుచుండగా, నందుండి యావధూవరులిరువురుబైటవచ్చినంజూచివిస్మయమునొంది. ఓహోయితడుమిగులప్రభావసంపన్నుండని పెక్కువిధములయతనింగీర్తించిరి. అంతనాయింద్రజాలకుఁడు తనజాలమునునిలిపినయాచక్రవర్తికిని సభికులకును యీయిరువురునుగనుపించక నింద్రజాలకుఁడుమాత్రముగనుపించి యోపుణ్యాత్ములారాసర్వమునామాయవలన మీనేత్రములకటులగనుపించెనేగాని నిజముకాదుబ్రాహ్మణుండును,బ్రాహ్మణియును,యుద్ధమును అగ్నిగుండమును,అగ్నిలోనాయిరువురుబడుటయును మగుడిలేచివచ్చుటయునుసర్వమునామాయయనిచెప్పిన,యారాజేంద్రుఁడునుసభికులునద్భుతపరులై యతనినాలింగనముచేసికొని పెక్కువిధములంగీర్తించియిష్టదేవునకుంబూజించునటులంబూజించుచు,నతనికివిందులుగావించుచుండిరి. ఆభాస్కరుండును వివిధవేడుకలుగావించుచు కండగర్వముచేత గురుని యాజ్ఞనుమఱచియుండఁగా, నాగురుఁడుతనజీవితకాలమునుజెప్పియుండియునుదనశిష్యుఁడురానందుకై మిగులవిచారమునొందియతడుండినస్థానమునుదెలుసుకొని క్రోధావేశముతోనాపురికివచ్చుచుండెను.

ఈవర్తమానమును భాస్కరుండెఱింగి మిగులవిచారమునొంది త్వరితముగా నామహాత్మునకు నెదురుగాఁబోయి యతనిపాదములమీద వ్రాలి పెక్కువిధములవినుతించిననుయతఁడొప్పక, ఓరికపటాత్మా గురుద్రోహీకండగర్వముచేతమదించి నన్నులక్ష్యపెట్టక నాయాజ్ఞనుమీఱి నడిచితివి, దురాత్మానరకమనుభవింతువుగాక, నీవిద్యనీతోడనశించునుగాక, నీకుండగినశిష్యుడులేకుండునుగాకయని యీమూడుశాపములిచ్చి ప్రాణాయామముచేత పద్మాసనముమీదంగూర్చుండి హంసనుసహస్రారకమలమునకుంగొనిపోయి యచటవిజృంభించి బ్రహ్మకపాలమును భేదించుకొని ప్రాణవియోగమునుబొందెను. అంతనాభాస్కరుఁడు ఘోరముగాదుఃఖించుచు నామహాత్మునిసమాధిగావించి, యాసమాధిమీద

నలుపదిదినములుపరుండి ధూపదీపనైవేద్యములను గావించుచుండెను. అటుపిమ్మటాభాస్కరుఁడు తనకునమ్మకమైనశిష్యుఁడు సంభవించనందుకై దుఃఖించి, తనవిద్యతనతోడం బోకుండునటుల యోచించి పదుగురుశిష్యులనుగూర్చుకొని వారికెంతబోధించినను వారికిఫలితార్థముకలుగనందుకై వగచుచుం గొన్నిదినములుండి యతఁడునుమరణించెను. అతనిశిష్యులు గొంతమట్టుకు జాలవిద్యను మాత్రము చేయుచుండిరి. ఇంద్రజాలమహేంద్రజాలాదివిద్యలులేవు. వాయుస్తంభన జలస్తంభనాదివిద్యలును, వివిధమంత్రయంత్రతంత్రములును, మోహనాదివిద్యలునుగలవు, మహామహిమలును, జిత్రవిచిత్రములును, ధనకనకవస్తువాహనములును, సుఖసంతోషములును,శృంగారవేడుకలును వివిధవాద్యగోష్ఠియును, గీతనృత్యనాటకాలంకారములును, నవరత్నములును, ఇవియన్నియునుమాయ, మనస్సునకుమిగులరమ్యమ్ములై మిత్రులపగిది వివిధవాంఛలనుబొందించుచు, మోహాంధకారముచేతను మదగర్వముచేతను ధనగర్వముచేతను రాజ్యగర్వముచేతను లోభముచేతను విషయములయందు ప్రవేశపెట్టుటచేత జననమరణప్రవాహమును దప్పించుకొనెడుయుక్తిలేక జననమరణములనుబొందుచుందురనిచెప్పిన యారామచంద్రుడద్భుతమునొంది,మునీంద్రా!ఇంద్రజాలమహేంద్రజాలవిద్యలిప్పుడుండినయెడల నేనుమిగులసంతుష్టితోనవిబరీక్షించక విడువననిపలికిన, యామునీంద్రుఁడతని చిత్తానందమునుగ్రహించి, యకటాయీపుణ్యపురుషునిమనంబింకను ధర్మార్థకామమోక్షములనెడుభ్రమలయందె తగులుకొనినిజ స్వరూపధర్మమునుగ్రహించుటకు నుపక్రమింపకున్నదియని మనంబునయోచించి యామునీంద్రుండిట్లనియె.

శ్రీరామచంద్రా శ్రద్ధాసక్తుడవై వినుము తొల్లియయాతిమహారాజు తనభార్యయైన దేవయానతోఁ జిత్రశయ్యమీఁదంబరుండి స్వప్నమునుబొందెను. ఆస్వప్నమునగొప్పవెలుఁగునుంగాంచి దివ్యవాద్యములఘోషములనువిని యాశ్చర్యపడిలేచికూర్చుండి నలుదిక్కులుపరికించుచుండెను. ఆవెంటనే యనేకరథములును గజములును తురగములును వేలకొలదికాల్బంటులునువచ్చిబారులుబారులుగానిలిచిరి, ఆగాజేంద్రుడివియెవరిసైన్యములనిజూచుచుండఁగా నొకదివ్యపురుషుఁడు శ్వేత

లని చెప్పినయీ రామచంద్రుఁడుమహాత్మామాయ యెటుకనుబుట్టించినవా రెవ్వరు, అదియెటులవచ్చెనుజక్కఁగావినుపించినాభ్రమనుదొలఁగించుఁ డనివేడిన యాతపోధనుండిట్లనియె.

శ్రీరామచంద్రావినుము "అధ్యారోపాపవాదాభ్యాం । అపమృత్యుర్భవిష్యతి" యనియును "అధ్యారోపాపవాదాభ్యాంనిష్ప్రపంచం ప్రపంచతే" యనియును బ్రమాణములున్నవికాఁబట్టి,అధ్యారోపాపవాదమును నేనెటులఁజేతును. ఈవాదమెన్నఁడునుం జేయఁగూడదుఁ లేని దానినికలుగఁజేసిచెప్పుటే యధ్యారోపాపవాదము, పండితపామరులుఅచలపరిపూర్ణబ్రహ్మమువలన ఆకాశాదిమహాభూతములుపుట్టినవని వేదశాస్త్రములనుగల్పించిరి. ఆహావారివివేకముమిగులదొడ్డదివారేమాయ యెటుకను బుట్టించినవారుగాని. అచలపరిపూర్ణబ్రహ్మమువలన మాయ యెటుకపుట్టనేలేదు, పుట్టించనుబడలేదు పుట్టినదనియును దెలియదు, అచలపరిపూర్ణబ్రహ్మము కేవలనిర్వికారము, ఏవికారమును లేనిది, ఏకాలమందును శరీరయాత్రలుకానిది, ఏరూపమును బొందనిది, ఏగుణములు లేనిది, ఇట్టిదట్టిదనినిర్దేశింపరానిది, అంతటనునిండిస్వతస్సిద్ధముగానుండెడు పరిపూర్ణమును దెలియకయుక్తిచేసి, తమకుతోచినమట్టుకువేదశాస్త్రములనల్లిరేగానినిజమెఱింగిచెప్పినవారుకారు, అవియన్నియుకలతవాక్యములేగానినమ్మతగినవికావు,గాబారుచేతనటులవ్రాసిరి. అచలపరిపూర్ణబ్రహ్మమునుదెలియనివారె, తెలిసియుండినయెడలయీపాపవాదమునుజేయరు, శరీరయాత్రలుగానిమహాకారణశరీరయాత్రలుగాని లేనట్టి నిర్వికారయచలపరిపూర్ణబ్రహ్మముతానెటులబుట్టించును. ఏవికారమును లేని యచలపరిపూర్ణమువలన యేవికారమునులేని యచలమే పుట్టునుగాని వికారములెట్లుపుట్టును. చైతన్యములేని తానుయెటులఁ బుట్టించును. ఏకాలమందునుబుట్టించబడలేదు. ఇఁకమీఁదనుబుట్టింపదు పుట్టించనుబడదు దానికి యేజోలిపట్టదు. ఎందుఁజూచిన నొకవిధముగా నేయుండునుదానికిఁబ్రతిలేదు,సమానములేదు. దానింజూడనిపండితపామరులుగాబారుచేత,అచలపరిపూర్ణబ్రహ్మమువలనమాయయెటుకపుట్టినదనిచెప్పిరి. సత్యమైనయచలపరిపూర్ణబ్రహ్మమువలన సత్యమేపుట్టునుగాని, అసత్యమైనమాయయెటుకయెటులపుట్టును. ఏకాలమందునుసత్య

మునం దసత్యముపుట్టనేపుట్టదు, పుట్టించనుబడదుగాఁబట్టి పండితపామరులుచేసిన యధ్యారోపాపవాదము మిగులతప్పువాదము. ఇంతటివివేకపరులు గొడ్డురాలకు బిడ్డయున్నదనియును కుందేటికికొమ్ములున్నవనియును. ఎండమావులయందునీళ్లున్నవనియును, రజ్జుసర్పమునుదారుపురుషుఁడు చంపెననియును జెప్పుటకుసందియము లేదు. ఆహాయెంతచదివినను భ్రమకే కారణము, భ్రమలేనిచదువుచదువవలెను, అదియేయచలపరిపూర్ణబ్రహ్మము, వేదములుమాయయొక్కయైనశరీరయాత్మలకేప్రమాణములుగాని యచలబ్రహ్మమునకుంబ్రమాణములుగావు,

ఇదియునుగాక తొల్లింటికథయొక్కటికలదు, చక్కగావినుము, ఉశక్కియనుదేశములో దబ్బరయను నొకపట్టణముకలదు. ఆపట్టణమును యేమిలేనిప్రభువు పాలించుచుండెను. ఆప్రభువు తన మంత్రులైన దారుపురుషునిం వంధ్యాసూనునింజూచి మిత్రులారామీరిరువురుంబోయియాకాశపుష్పమును దెమ్మనిసెలవిచ్చిన యాయిరువురునుప్రయాణమైపోవుచునామార్గమునవివిధవేడుకలనుఁ జూచుచుంబోయిపోయి యొకప్రదేశమునరజనుష్టికములువిశేషముగానుండుటనుజూచి యాశూరులిరువురువెండిగనియనిమిగులసంతసించి, ఆహాతమ్ముఁడా ఓహో యన్నా మనముతొలిజన్మమున నెంతటిపుణ్యము చేసితిమో తెలియదు, మనకీజన్మమున వెండిగనిసంభవించెను, కృతార్థులమైతిమని యాయిరువురుపైవస్త్రములను భూమిమీఁదంబఱచి యాగుల్లలం బోగు చేసుకొని మూటలుగట్టిరి, ఆమూటలలోవంధ్యాసూనుడుగట్టి నమూటపెద్దదిగానుండుటను దారుపురుషుఁడుచూచి, యన్నా మనమిద్దరము నొకటిగా గూడివచ్చితిమి, యేమి దొరికినను సమానముగాఁ బంచుకోవలయునే గాని, వ్యత్యస్తపు భాగములుగానుండకూడదు. నీమూటపెద్దదిగా నున్నది, నామూటచిన్నదిగానున్నది, నాకుంబంచిపెట్టుమనియడిగినయాగొడ్రాలుబిడ్డ నేనునీకుపంచిపెట్టను. నేనుత్వరపడి జాస్తిగా పోగుచేసుకొంటిని, నీవునుబోగుచేసుకోరాదాయనిపలికెను. ఆదారుపురుషుఁడు పంచిపెట్టకనిన్నుంబోనివ్వనని యతనిమూటం బట్టుకొనెను. ఆవంధ్యాసూనుఁడుగోపించి యతనింబిడికిటంబొడిచెను, ఆదారుపురుషుఁడు రౌద్రాకారుండై యతనిరొమ్ములమీఁదంగొట్టెను. అంతనాయిరువురు హా

స్త్రములతోఁ గొంతసేపు పోరాడి, ఆయుధములతో యుద్ధము చేయుద
మని యోచించి, శశవిషాణములనూడబెరికి వాటితో యుద్ధము చేయుచు
దేహములు గాయపడి రక్తములు గారుచుండగా మిగులఁ దప్పిగొని, దా
హామార్చుకొని వచ్చినపిమ్మట మగుడి యుద్ధము సేయుదమని యోచించి,
యెండమావులనుజూచి నీళ్లని భావించి యత్యంత దాహము చేత నిరువురుప
రుగుబారిపోవుచుండిరి, ఆయిరువురను రజ్జుసర్పము గఱచుట చేత నిద్దరు సర్ప
విషము తలకెక్కినవారలై, వెంటనే ప్రాణవియోగమునుఁ బొందిరని చెప్పి



శ్రీరామచంద్రుఁడు.



వసిష్ఠమహాఋషి.

న, యీ రామచంద్రుఁడు మహాత్మా మిగుల యద్భుతమైన చరిత్రమును జె
ప్పితిరని పకపక నవ్వుచు, ఆహా మిగులఁ జిత్రమైన కథగా నున్నది, ఇట్టి కథ
నుము నెన్నఁడును వినలేదు, నిజము లేశమైనను లేదు, గొడ్రాలకు బిడ్డ యుం
డునా, దారుపురుషుఁడగునా, రజను ప్తికములు వెండియగునా, కుందే
టికి కొమ్ములుండునా, ఎండమావులయందు నీళ్లుండునా, రజ్జుసర్పము గఱ
చునా, ఆకాశమందు పుష్పముండునా, సర్వము నుదబ్బర, అంతయు నుశ
క్కి, నిజము గొంచెమైనను లేదు. అబ్బా మిగుల వింతమైనకథ జెప్పితిరని

యామునీంద్రునింగీర్తించి, పావనచరితా! నామనంబునకుఁ గొప్పసందియము జనించుచున్నది, అచలపరిపూర్ణబ్రహ్మమువలన మాయయొక్క పుట్టకుండిన యది యెట్లువచ్చి శరీరయాత్మలై పరిణమించి యెట్లుఁ బోవుచున్నదని యడిగిన, యామునీంద్రుఁడు రాజేంద్రా! మాయయొక్క యెవరివల్లను బుట్టినది కాదు, దానికి తల్లిగాని తండ్రిగాని లేదు, అది తల్లిదండ్రులు లేకనే వచ్చినది, తనంతట తానే వచ్చి తనంతట తానేఁ గొన్నిదినములుండి తనంతట తానే మటుమాయముగా బోవుచుండును. కాఁబట్టి మూలము లేని యామాయయొక్క పుట్టనే లేదు, పుట్టుక లేని దానికి చావును లేదు. వచ్చుట లేదు, పోవుట లేదు, రాకపోకలకు భ్రమయే కారణము, భ్రమకు నిలకడ లేదు. కలలో వచ్చిన యేనుఁగులును, గుఱ్ఱంబులును, సుందరమైన దేవతాస్త్రీలును మేలుకొనిన యేమి లేకపోయెను. భ్రమవలనం జిత్తమునకటులఁ దోచెనేగాని నిజముగా రాలేదు, నిజముగాఁ బోలేదు, వాటిని యెవరు రప్పించిరి, యెవరుగొనిపోయిరి, భ్రమవలన నామాయ నడమంత్రముగానే వచ్చి నడమంత్రముగానేఁ బోవును, గురువాక్యముచేత మేలుకొనినవారికిం భ్రమ యేకాలమందునుఁ బుట్టదు. భ్రమ లేనివారే అశరీరులు, భ్రమ లేనివారే అచలులు, భ్రమ లేనివారే ప్రకృతిద్వయదోషరహితులు గాబట్టి గురుకటాక్షమునుఁ బొందినవారికి సూర్యకిరణములకు మంచువిడియునటుల భ్రమవిడిచిపోవుటకు సందియము లేదు. మాయయొక్క వచ్చినవిధమును, బోయెడువిధమునుఁ దెలిసిచెప్పుటకుఁ ద్రిమూర్తులకైన నలవికాదు. లేని మాయయొక్క గనుకనే యది యెవ్వరికినిఁ దెలియఁబడక, నిలుకడయును లేక మటుమాయముగాఁ బోవుచుండును. భ్రమరూపకమైన మాయయొక్కను మేము యెఱుఁగుదుమనియును జ్ఞానముచేతం దెలుసుకొంటిమనియును, యోగసమాధులే యాత్మనుం జూచుటకు కారణములనియును, జూచినవెంటనే యామాయయొక్క మాయమైపోయెననియునుఁ జెప్పుదురు. ఆత్మస్వరూపుం డెవ్వరికినిఁ గనుపించనందుచేతనేఁ, గొందఱు కళాస్వరూపమనియును, గొందఱు యానందస్వరూపంబనియును, గొందఱు చిదాకాశమనియును, గొందఱు జ్యోతియనియును నానావిధములుగాఁ జెప్పుదురు. అందరును జూడనివారే, గ్రంథములనుఁ జూచి భయపడి గాబారుచేత తబ్బిబ్బుమాటలుగాఁ జెప్పుదు

రుగాని నిజముగాఁజూచినసమాచారముకాదు. మాయయెఱుకనుఁజూ
చియుండినయెడల వేదములనుఁగల్పించినవారు దానినియిట్టిదట్టిదనినిర్దే
శించిచెప్పక యాత్మయనియును, ప్రజ్ఞానమనియును,అహంబ్రహ్మాస్మియ
నియును, తత్వమసియనియునునాలుగు ప్రకారములుగానేలజెప్పిరి. కా
బట్టిమాయయెఱుకను యెవ్వరునుఁజూడలేదు. అదిభ్రమస్వరూపముగ
నుక లేనిదనేతీర్మానము, వేదములుయిరువదియైదు తత్వములుగల శరీర
యాత్మలనేజెప్పుటచేత వేదములుమాయకేప్రమాణములు. ఆత్మమా
య, అంతరాత్మమాయ, జీవేశ్వరులుమాయ, ప్రజ్ఞానముమాయ, మ
నస్సుమాయ, బుద్ధిమాయ, చిత్తముమాయ, అహంకారముమాయ,
పంచప్రాణములుమాయ, పంచతన్మాత్రలుమాయ, కర్మేంద్రియములు
మాయ, అధిదేవతలుమాయ, అధిభూతములుమాయ, సర్వసాక్షిమా
య, చైతన్యస్వరూపిణియనుయమ్మవారుమాయ. ముక్తికాంతమాయ,
ఆదిశక్తిమాయ, మహాశివుడుమాయ, నారాయణుఁడుమాయ, సచ్చి
దానందముమాయ, కళమాయ, జ్యోతిమాయ, ఆనందముమాయ,ప్ర
జాపతిమాయ, ప్రపంచముమాయ, చిదాకాశముమాయ, భ్రమస్వ
రూపకముగనుక మాయకుమూలములేదు. మాయగానిదే యచలపరి
పూర్ణబ్రహ్మము, అదియాత్మకాదు, శరీరముకాదు, ఇరువదియారవది
యైన పరతత్వము. పరతత్వమైనయచలమునకు స్థూలసూక్ష్మకారణశరీ
రములుగాని, మహాకారణదేహముగాని, అన్నమయ. ప్రాణమయ, మ
నోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములుగాని, జాగ్రత, స్వప్న,
సుషుప్తి, తుర్యమను అవస్థలుగానిలేవు. తుర్యాతీతమేయచలము, అది
పురుషుఁడుగాడు. స్త్రీగాదు, కలలోవచ్చి మేలుకొనినం బోయెడువాఁ
డుగాఁడు, సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవ
స్తువులయందును, చలించక స్వతస్సిద్ధముగానుండువాఁడు, రాఁకపోకలు
లేనివాఁడు, సచ్చిదానందరహితుఁడు, ప్రపంచమునుయెరుగడు, యెఱు
కలేనివాఁడు, కార్యకారణములుయెఱుక, ప్రకృతిపురుషులుయెఱుక, జీ
వేశ్వరులుయెఱుక, నాదబిందుకళలుయెఱుక, క్షేత్రబీజములు యెఱుక,
విద్యావిద్యలుయెఱుక, సగుణనిర్గుణములుయెఱుక, దేహి దేహములు
యెఱుక. భగవంతుఁడుయెఱుక, ఆదినారాయణమూర్తియెఱుక, మహా

లింగముయొక్క, త్రిమూర్తులయొక్క, చిదాకాశముయొక్క, ప్రపంచముయొక్క, విశ్వరూపముయొక్క, శరీరముయొక్క, యొక్కయనగా మాయ: మాయయనగాభ్రమ, ప్రపంచముభ్రమ, లోకములుభ్రమ, జననీజనకులు భ్రమ, పుత్రీపుత్రులు భ్రమ. భార్యాభర్తలు భ్రమ, స్త్రీపురుషులు భ్రమ, దేవతలుభ్రమ, పదవులుభ్రమ, స్వర్గనరకంబులు భ్రమ, బంధమోక్షంబులు భ్రమ, సుఖదుఃఖంబులు భ్రమ, జననమరణంబులు భ్రమ, నామరూపంబులుభ్రమ, కులగోత్రములుభ్రమ, పంచభూతములు భ్రమ, పంచలోహములు భ్రమ, నవరత్నములు భ్రమ,ధనధాన్యములుభ్రమ,గృహగోపురములుభ్రమ, సర్వజ్ఞత్వములు భ్రమ,కించజ్ఞత్వములుభ్రమ,పుణ్యపాపంబులుభ్రమ, అహంకారమును భ్రమయునొక్కటే,అహంకారమునకేభ్రమఅహంకారము లేకుండినభ్రమలేదు. అహంకారములేనియచలబ్రహ్మమునకేమిభ్రమయున్నది. అహంకారముతోటిభ్రమపోయెను.అహంకారమునకేకులగోత్రములు.అహంకారములేనియచలపరిపూర్ణమునకుయేమికులమున్నది. ఏమియును లేనిదే యచలము, ఉపాధిద్వయదోషరహితమేయచలము. నీనిజస్వరూపమేయచలము,నీనిజస్వరూపమే రూపనామములులేని పరతత్వము, నీనిజస్వరూపమేనిర్వికారము, నీనిజస్వరూపమేనిరంజనము. నీనిజస్వరూపమేయశరీరము, నీనిజస్వరూపమే సదాయుండునది, నీనిజస్వరూపమే శరీరయాత్మలులేనికేవలాత్మ, నీనిజస్వరూపమేప్రకృతిద్వయదోషరహితము, నీనిజస్వరూపమేపరమపదము, నీనిజస్వరూపమేసర్వకాలములయందును, సర్వదేశములయందును, సర్వావస్థలయందును స్వతస్సిద్ధముగానుండునది, నీనిజస్వరూపమునినను: చూడదు,చేయదు,భాషించదు, చేయించదు, పెరుగదు,తరుగదు, అరుగదు,కరుగదు,తిరుగదు, మొలగదు,రతిచేయదు, పుట్టదు,గిట్టదు,సర్వకాల మొకరీతిగానేయుండును. నీనిజస్వరూపమైన యచలమునకుశరీరరహితము, అదియాత్మకాదు, పరమాత్మకాదు, ప్రజ్ఞానముకాదు, చైతన్యముకాదు, సర్వసాక్షికాదు, అంతరాత్మకాదు, జీవేశ్వరులుకాదు,చిదాకాశముకాదు, చిత్తుకాదు, ద్రష్టకాదు, జ్యోతికాదు, ఆనందముకాదు, మోక్షాదిపదవులుకావు, త్రిగుణములుకాదు, శ్రీమన్నారాయణమూర్తికాదు. శ్రీసదాశివుడు

గాదు, బ్రహ్మదేవుఁడుగాదు, ఐక్యముకాదు, కళగాదు, సూర్యమండలముకాదు, చంద్రమండలముకాదు, అగ్నిమండలముకాదు, క్షేత్రముకాదు, క్షేత్రజ్ఞుఁడుగాదు,ప్రకృతికాదు, పురుషుఁడుకాదు,స్త్రీకాదు,నపుంసకుఁడుకాదు,శూన్యముగాదు, తత్పద త్వంపదములుకాదు,అసిపదముకాదు, విద్యావిద్యలుకాదు,బీజజడములుకాదు' అకారముకాదు' ఉకారముకాదు, మకారముకాదు, ఈమూఁడునుఁగూడినఓంకారమునుగాదు, త్రికూటముగాదు, భ్రూమధ్యముకాదు, ముక్తికాదు,ముక్తికాంతయునుగాదు, భక్తిగాదు, వైరాగ్యముకాదు, యోగముకాదు, జ్ఞానముకాదు, సమాధికాదు, నీమముకాదు, నిష్ఠకాదు, బంధముకాదు, మోక్షముకాదు, పదవులుకాదు, ప్రపంచముకాదు,ప్రణవముకాదు, ప్రజ్ఞకాదు,సప్తకోటిమహామంత్రములుకాదు, శక్తికాదు, నాలుగువేదములుకాదు,అఱుశాస్త్రములుకాదు, ఆకాశముకాదు,వాయువుగాదు, అగ్నికాదు, జలముకాదు, పృథివికాదు, విశ్వముకాదు,జగముకాదు, అర్ధనారీశ్వరుఁడుగాదు, హంసకాదు, హరిహరులుకాదు, అండముకాదు,పిండముకాదు,బ్రహ్మాండమునుగాదు, లక్ష్యార్థములుకాదు,లక్ష్యముకాదు, ముద్రలుకాదు,మానముకాదు, ప్రసంగముకాదు, స్థూలముకాదు,సూక్ష్మముకాదు, కారణముకాదు,కార్యముగాదు, బ్రహ్మగాదు, విష్ణువుగాదు, శివుఁడుగాదు,శక్తిగాదు, కైలాసముగాదు, సత్యలోకముగాదు,వైకుంఠముగాదు,మోక్షముగాదు,జీవన్ముక్తిగాదు, పంచకోశములుగాదు,జ్ఞానకర్మములుగాదు, బంధమోక్షములుగాదు, శ్రుతులుగాదు,స్మృతులుగాదు,సూత్రములుగాదు,భాష్యములుగాదు, కర్తగాదు, భోక్తకాదు, ఉపాధిద్వయదోషరహితమైన పరమపదమే నీనిజస్వరూపము,నీనిజస్వరూపమునకు శరీరత్రయములేదుగనుక పాపముచేయదు,పుణ్యముచేయదు, పుట్టించదు,పుట్టించనుఁబడదు,చిక్కదు,చొక్కదు.భోగించదు,భోగములెఱుగదు,వినదు,తినదు,చూడదు. అవయవములులేనిదిగాఁబట్టి యొఱుకలేదు,మఱపులేదు, రూపనామములులేదు, నీనిజస్వరూపమును నిర్ణయించిచెప్పుటకు హరిహరాదులకైనసాధ్యపడదు,యుగములపర్యంతముసమాధినిష్ఠలుసాధించినవారైననునిన్నుఁగాంచజాలరు. సాధ్యాసాధ్యములులేనివాఁడవు. సగుణముఁడవు. అంతరంగుఁడవు.

నీకు రెండవదిలేదు, గురుకటాక్షముచేతఁగాని నిన్నుంజూడఁజాలరు, గురుకటాక్షముకంటె వేరొండులేదు, గురుఁడేదేవునింజూపించువాఁడు, దేవభ్రాంతిగలవారికిని, లోకభ్రాంతిగలవారికిని, మోక్షభ్రాంతిగలవారికిని దెలియంబడవు. జ్ఞానకర్మములయందాశయుండినప్రకృతిద్వయమువిడువదు, ప్రకృతిద్వయదోషుఁడేపరబ్రహ్మము, ప్రకృతిద్వయదోషుఁడేనారాయణమూర్తి, ప్రకృతిద్వయదోషుఁడేపరమశివుఁడు, ప్రకృతిద్వయదోషులేబ్రహ్మేంద్రాదులు, ప్రకృతిద్వయదోషులేఋషులు, ప్రకృతిద్వయదోషులేజ్ఞానులు, ప్రకృతిద్వయదోషులే యోగులు, ప్రకృతిద్వయదోషులేభక్తులు, ప్రకృతిద్వయదోషులేదేవతలు, ప్రకృతిద్వయదోషులేమానవులు, ప్రకృతిద్వయదోషులేచతుష్పాదద్విపాదజంతువులు, ప్రకృతిద్వయదోషులే క్రిమిపక్షికీటకాదులు, ప్రకృతిద్వయదోషులేరాక్షసులు. ప్రకృతిద్వయదోషులే త్రిలింగములు, ప్రకృతిద్వయదోషరహితమే నీనిజస్వరూపము. ఉపాధిద్వయదోషమేవిధినిషేధము, ఉపాధిద్వయదోషమేవుపవాసము, ఉపాధిద్వయదోషమేవ్రతము, ఉపాధిద్వయదోషమే నీమము, ఉపాధిద్వయదోషమేనిష్ఠ, ఉపాధిద్వయదోషమే ఆత్మధ్యానము, ఉపాధిద్వయదోషమేజ్ఞానము, ఉపాధిద్వయదోషమేయోగము, ఉపాధిద్వయదోషమేభక్తి, ఉపాధిద్వయదోషమేవైరాగ్యము, ఉపాధిద్వయదోషమేజడలుదాల్చుట, ఉపాధిద్వయదోషమే సన్న్యసించుట, ఉపాధిద్వయదోషమేస్నానము, ఉపాధిద్వయదోషమేప్రసంగము, ఉపాధిద్వయదోషమేప్రపంచము, ఉపాధిద్వయదోషమే వేదశాస్త్రములనుగల్పించినది, ఉపాధిద్వయదోషమేఅహంకారుఁడు, అహంకారమువల్లనే చావుపుట్టుకలు, అహంకారమువల్లనే జ్ఞానకర్మములు, అహంకారమువల్లనే బంధమోక్షములు, అహంకారమువల్లనే సుఖదుఃఖములు, అహంకారము లేనివారికియేమియునులేదు, ప్రపంచములేదు. ఉత్పత్తిస్థితిలయంబులులేవు, రూపనామంబులులేవు, అహంకారములేకుండుటే నీనిజస్వరూపము నీనిజస్వరూపమునకు వేదశాస్త్రములు ప్రమాణములుకావు. వేదశాస్త్రములుమాయయొక్కకే ప్రమాణములు, గొడ్రాలకు బిడ్డలేనటులప్రకృతిద్వయదోషరహితునకుయొక్కటి లేదు. ఎండమావులయందునీళ్లులేనటుల ఉపాధిద్వయదోషరహితులకుప్రపంచములేదు. ఆకసమునందుపు

ష్పము లేనటుల గురుమర్మము దెలిసినవారికి లోకము లేదు. కుండేటికి కొమ్ము లు లేనటుల ఆచార్యకటాక్షమును బొందినవారికి జగత్తు లేదు. కొయ్య యందు పురుషుడు లేనటుల విచారణపరులకు విశ్వము లేదు, త్రాటి యందు సర్పము లేనటుల అచలపరిపూర్ణునకు భ్రమ లేదు. సర్వము భ్రాంతి, భ్రాంతి చేత నేయున్నవి లోకములు, దేవుండ్లు, పదవులు, పుణ్యస్థలము లు, కులభేదజాతిభేదములును గలిగియుండుట గాబట్టి శరీరయాత్రలు, భ్రమ, రూప నామములు భ్రమ, ధననిక్షేపములు భ్రమ, సంపత్తు భ్రమ గురుకటాక్షమును బొంది నిజస్వరూపమెఱింగిన పుణ్యపురుషులకు మ అల భ్రాంతిపుట్ట నేరదు. భ్రాంతి పుట్టుటకు నింద్రియములు లేవు, శరీర యాత్రలు లేవు, నిర్వికారమున కేమియును లేవు. కలలోవచ్చిన శరీరము లును, జిత్రవిచిత్రములును, ధనవస్తువాహనములును, సుఖానందమును మేలుకొనిన యేమి లేదు. గురువాక్యము చేత మేలుకొనినవారికి గుఱుతు మెఱిగే శరీరము యేమి లేదు. సర్వము భ్రాంతి, భ్రాంతిరూపకమైనమా యయొుక, అచలపరిపూర్ణబ్రహ్మమువలనంబుట్టినదని కపీశ్వరుడు చెప్పి నాడు. ఏమియును లేని పరిపూర్ణము వలన మాయయొుక యెట్లు పుట్టును, పు ట్టినవాడుగాదా పుట్టించును. పుట్టనిచావనిపరిపూర్ణ మెటుల పుట్టించు ను, ఇదియే అధ్యారోపాపవాదము. ఈవాదమును గపీశ్వరుడు చేసినా డుగనుక కపీశ్వరుడే పుట్టుచున్నాడు, కపీశ్వరుడే గిట్టుచున్నాడు. మాయ యొుక పుట్ట నే లేదు, మాయయొుక కు జననీజనకులు లేరు. తల్లిదండ్రు లు లేక యెటుల పుట్టును, పుట్ట నే లేదు. మూలము లేని యొుకను గుర్తు యెరు గుటగురుద్రోహము. మూలము లేని యొుక పుట్టదు చావదు. పుట్టినట్టు నుజచ్చినట్టును దోచుట భ్రమ, భ్రమ లేని దే యచలము, అచలమువలన నే మియును బుట్ట నే లేదు పుట్టించనుబడ లేదు. మూలము లేక నే మాయయొు క మటు మాయముగావచ్చి మటుమాయముగాబోవుచుండును. రాకపోక లకు భ్రమయే కారణము. కాబట్టి పుట్టేదియేమి, చచ్చేదియేమి, ఆ హా లేని దే చెప్పి భ్రమింపజేసిన యాకపీశ్వరునిబుద్ధికి సంతసించెదను. మా య యొుక తనంతట తా నే వచ్చి తనంతట తా నే కొన్ని దినములుండి తనం తట తా నే యేమియును లేక పోవును. సర్వము చిత్తవృత్తి, చిత్తు డే, మూ లమాను, కలలో శరీరములు యెంసుంషి వచ్చెను, ఎక్కడికిం బోయెను,

భ్రమమాత్రమేగానినిజముగారాలేదు.పోలేదు అహాయేమియాశ్చర్యము మూలములేనిమాయకునిలుకడలేదు, వున్నదికాదు. లేనిమెఱుకయెన్ని విధముల భ్రమింపఁజేయుచున్నది, మాయనువిచారించినకొద్ది భ్రమవిస్తరించుచుండును, భ్రాంతిలేనిచదువుచదువవలెను, భ్రమలేనివాడవు గమ్ము, ప్రపంచముమాయ, జీవేశ్వరులుమాయ, అంతరాత్మమాయ, చిదాకాశముమాయ, చిత్తుమాయ, సర్వసాక్షిమాయ, ద్రష్టమాయ, ఐక్యముమాయ, ప్రజ్ఞానముమాయ, జ్యోతిమాయ,ప్రకాశముమాయ, చిత్రతళుకులుమాయ, త్రిమూర్తులుమాయ, అండాండములుమాయ, పిండాండములుమాయ, బ్రహ్మాండములుమాయ, సూర్యచంద్రులుమాయ, పంచభూతములుమాయ, పంచేంద్రియములుమాయ,పంచశక్తులు మాయ, పంచబ్రహ్మలుమాయ, ప్రకృతులుమాయ, మోక్షాదిపదవులుమాయ, కలలోవచ్చినవన్నియును మేలుకొనినమటుమాయ, ఏమియునులేదు, ఈవుత్తబట్టబయలుకంటెయేమిలేదు,ఇంతకుమిక్కిలిలేదు, ఇంతకంటెయెక్కువలేదు. ఇదియేపరిపూర్ణము.ఇదియేనీనిజస్వరూపము, నీనిజస్వరూపమేకల్పనారహితము. నీనిజస్వరూపమేనిత్యము, నీవేదేవదేవుండవు. నీవేదొరవు.నీవేశాశ్వతుండవు. నీకురెండవదిలేదు. నిన్నుదర్శించినవారికేజన్మరహితము, నీదర్శనమేపుణ్యపాపరహితమని నిజస్వరూపమును సూచనగావించెను. ఆరామచంద్రుఁడుగ్రహించి నిజస్వరూపమునకంటె నేమియునులేదని ముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని సర్వముయచలపరిపూర్ణమని యాశ్చర్యపడుచుండెను.

వశిష్ఠమహాఋషి బిడ్డాగురుశిష్యరహితమైన యీపరిపూర్ణముకంటెనుయేమిలేదు, ఇదియేద్వాదశాక్షరీమంత్రము,జ్ఞానమువలనగుఱుతుమెఱుగుటఁగాఁబట్టి, మూలములేనియీగుఱుతుమెరిగే శరీరముయేమిలేదు, ఇదియేషోడశాక్షరీమంత్రము, ఈరెండుమంత్రములనుస్మరించుటే భ్రాంతిరహితము. ఈమంత్రములురెండును దనకుతానే తాత్పర్యముగావలయును,కలలోవచ్చినశరీరము మేలుకొనినయేమిలేదు, ద్వాదశాక్షరీకంటెను యెక్కువలేదు,షోడశాక్షరికంటెనునీచములేదు, నీకుభ్రాంతియెన్నడునుబుట్టబోదు, పుట్టుటకునేమియునులేదు, మెటులపుట్టును బుట్టనేపుట్టదు, నీకుజననీజనకులును సోదరులును భార్యయును గలరా,

ఇంద్రియములున్నవా, చావుపుట్టుకలున్నవా, భ్రాంతిపుట్టునా, నిజముగాఁజెప్పుమనిన యీరామచంద్రుఁడా మహాత్మునిపాదకమలములనుదన నేత్రములతోనద్దుకొనిస్వామీగురువరా, నానిజస్వరూపమును నేనేమని జెప్పుదును, నాకుశరీరయాత్రలులేవు, చావుపుట్టుకలులేవు, బంధమోక్షములులేవు, ఇంద్రియములులేనివానికి భార్యయునులేదు, పుట్టుకలేని వానికిజననీజనకులులేరు, యేవికారమునులేనియశరీరిని, అద్వయుండను నాకురెండవదిలేదు, నేనుయేకాలమందును యెఱుకాకారముకాలేదు, యెఱుకనుబుట్టించలేదు, పుట్టినదనియును దెలియదు. ప్రపంచమెరుగను, సత్యాసత్యములనెరుంగను, నానిజస్వరూపమునకంటె యేమియునులేదని పలికిన యీమునీంద్రుఁడతనిముద్దుపెట్టుకొని బిడ్డానిజమెరింగితివిగదా నీనిశ్చయమునువిడువవద్దు, మూలములేనియీగుఱుతు యెరిగేశరీరము నీవనిభావించవద్దు. అటులభావించుటేగుఱుతుయెరుగుట, గుఱుతుయెరుగుటేభ్రమ, గుఱుతుయెరుగుటేజ్ఞానము, గుఱుతుయెరుగుటేకర్మము, గుఱుతుయెరుగుటే పుణ్యపాపములు, గుఱుతుయెరుగుటేసుఖదుఃఖములు, గుఱుతుయెరుగుటే బంధమోక్షములు, గుఱుతుయెరుగుటేచండాలము గుఱుతుయెరుగుటే గురుద్రోహము, గుఱుతుయెరుగుటచేతనే జననమరణములు, ఈగుఱుతుయెరిగే శరీరమునకుమూలములేదు, మూలము లేనిదానికి యేమియునులేదు, సర్వముభ్రాంతి, ఇది రజ్జుసర్పభ్రాంతి, విచారణచేతగాని భ్రాంతివిడువదు, ఈపరిపూర్ణమునకంటెను యేమిలేదు, భ్రమస్వరూపకమైన మాయయెఱుకను నాకుగురుదక్షిణగానిమ్ము, గురువునకర్పించినసొత్తునుగాని యెఱుకనుగాని పదపడిగ్రహించుటపాదిత్యము, నీనిజస్వరూపమేనీవుగదా, నీకెందునుభ్రమపుట్టనేరదుగదా, ఈచండాలమైనమాయ యెఱుకతోటిసంబంధమునువిడిచి, ఉత్తపరిపూర్ణము యేమిలేదనియును, ఈగుఱుతుయెఱిగేశరీరమునకు మూలములేదనియును జపించుచుండుము, చండాలసంసర్గ నిన్నుంబాసిపోవును, ఇదేపరమరహస్యము, ఇంతకంటెను యేమిలేదు, మనమిరువురసంవాదచరిత్రంబైన శ్రీరామహృదయమనెడుయీవేదాంతగ్రంథమును జదివినవారును, వినినవారును మోక్షాదిపదవులను బొందుదురు. గురుకటాక్షముచేత విచారణచేసిన పుణ్యాత్ములు ప్రకృతిద్వయదోషరహితమైనపరమ

పదమునుబొందుదురు. ఇందుకుసందియములేదు, ఇదిగురువాక్యము, ఇది వేదాంతము. ఇంతకంటెను విశ్రాంతిమార్గమువేఱొండులేదు.

జ్ఞానకర్మములలోని మార్గములుయనేకములుగలవు, అవియన్నియుజననమరణప్రవాహములోనివి, వాటినివినరాదుస్మరింపరాదు. వారే మాయకులు, వారేభక్తియోగజ్ఞానులు, వారికే వేదములుప్రమాణములు, వారేజచ్చువారును, బుట్టువారును, వారువేదాంతులుగారు. వారువిశ్రాంతిమార్గమ్మునుయెరుగరు, వారేమిథ్యాస్వరూపకమైనప్రపంచమును సత్యమనినమ్మెవారు, వారేప్రకృతిద్వయదోషులు, వారేయాత్మ నిత్యమని చెప్పుచునాత్మతోడంజచ్చియాత్మతోడ దేహముయెత్తుదురు, వారేయు పాధిద్వయదోషులనిచెప్పిన, యీరామచంద్రుఁడానందభరితుండై యీ మునీంద్రునిపాదకమలములను బన్నీటంగడిగి, యర్ఘ్యపవంననాది పూజలుగావించి. సువర్ణరత్నములతోఁబూజించి ధూపదీపనైవేద్యములచేత సంతుష్టినొందించి, యీమహాత్మునిశ్రీపాదజలమును భుక్తిశేషమును తీర్థప్రసాదములుగాగ్రహించియీగురుస్వామికి వెలలేనివస్త్రాభరణములను వివిధవస్తువులనిచ్చి ప్రయాణముచేసి తానుబాదచారియైయీమహాత్ముని వెంటఁగొంతదూరముపోయి యతనివలనదీవనలుగ్రైకొని, మగుడిపురిలోనికివచ్చియీమునీంద్రునియద్భుతపుశక్తికియాశ్చర్యపడుచు, నామహాత్ముడిచ్చినమంత్రములను ముమపకయనేకులండై, యచలుండై, పరిపూర్ణుండై, ప్రకృతిద్వయదోషరహితుండై సచ్చిదానందరహితుండై, శాశ్వతుండై యుండెనని చెప్పిన యీశిష్యవరులుయద్భుతమునొందె. గురురాయునింజూచి పావనచరిత్రా, అత్యద్భుతమైనవశిష్ఠ శ్రీరామసంవాదమునుజెప్పి మాకుభ్రాంతినిరాసకంబు గావించితిరి, మహాత్మా ప్రపంచభ్రాంతియును, స్వప్నభ్రాంతియును, ఇంద్రజాలభ్రాంతియును, మమ్ముంబాసిపోయెను. భ్రమస్వరూపకమైనమాయ యొక్కసంబంధముసు విడిచినిజస్వరూపమునుబొంది నిత్యులమైతిమి, ఐనను దేవరవారికొకవిన్నపము, మోహాదిపదవులకన్నిటికిం గర్తయెవ్వరు, ఏవిచారణచేతనవిపొందవచ్చును, అవిస్థిరములా అస్థిరములా, దయతోమాకెఱింగించుడనివేడిన యీగురువరుండిట్లనియె,

భక్తులారా, ఆత్మయేపరబ్రహ్మము, వేదములు యాత్మకేప్రమా

ణములు, ఆత్మనుగురించే వేదములువచించుచున్నవి, ఆత్మయే మాయ యొక్క, మాయయొక్కచైతన్యస్వరూపిణియనుయమ్మవారు, ఆదేవిస ర్వసాక్షిస్వరూపమై కన్నులయందున్నది, ఆదేవిని ముక్తికాంతయని యును, ఆదిశక్తియనియును, ద్రష్టయనియును,ఆపోజ్యోతియనియును, శ్రీమన్నారాయణుండనియును, మహాలింగమనియును చెప్పుదురు, ఆదే వివలనచిదాకాశమును, ఆచిదాకాశమువలనసోహమును రెండక్షరము లతోగూడిన ప్రణవమనుశబ్దమునుగలిగెను. ఆప్రణవమునే హంసయ నియును, పరమహంసయనియును,ప్రాణవాయువనియునుచెప్పుదురు. ఆ పరమాత్మునియొక్క త్రిగుణములనే త్రిమూర్తులని అకార ఉకార మ కారములని నానావిధములుగాచెప్పుదురు, కాబట్టిమోక్షాదిపదవులకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కర్తలుగారు, వీరుప్రతిదినమునిద్రయనెడుప్రళ యమున త్రిగుణశూన్యంబై పోవువారు, వీరుముగ్గురు మూడులోకము లకుకర్తలుగాని మోక్షాదిపదవులకు కర్తలుగారు, మాయయొక్కయే కర్తగాను కర్మగాను క్రియగాను కారణకార్యములుగానున్నది,కాబట్టి మోక్షాదిపదవులకు యొక్కకర్త. ఆయొక్కదన్ను బ్రహ్మమని భ్రాంతిప డినభక్తులకును వివిధసాధనపరులైన యోగులకును, జ్ఞానులకును, ఆరు పదవులను గల్పించెను. అవియెవ్వియనిన, సాలోక్యము, సారూప్య ము, సామీప్యము,సాయుజ్యము, సార్ష్టిత్వము,మోక్షము, ఈయారును మాయవలన గల్పితములుగాబట్టి భ్రమరూపకములు, భక్తయోగజ్ఞా నులు మాయయొక్కను బ్రహ్మమనినమ్మి,నాదబ్రహ్మమునుతెలిసియానందిం తురు, ప్రణవధ్యానముచేయుదురు.షడాధారములనుదర్శించుచును,చిదా కాశమునందునువ్యాపించి చిత్కళలనుదర్శించి యానందింతురు, ముక్తి కాంతనుసేవింతురు, ఈమాయవలనగానుయీ పదవులనుగల్పింపబడె ను, అవి కల్పితములుగాని శాశ్వతములుగా నుండునవిగావు, అస్థిరము లైనపదవులు, పుణ్యమునశించగానే మరలజననమునకు రప్పించునట్టివి, జననమరణప్రవాహములోనివి, పుణ్యపాపములుగలవి, సుఖదుఃఖములు గలవి, ఈబ్రహ్మాండమున నొక్కొకప్రదేశమున నిర్ణయింపబడినవి,ఇవి భ్రమస్వరూపకమైనపదవులు. అవి సువర్ణరత్నములతో నిర్మింపంబడిన సుఖస్థానము లగుటచేసి భ్రమచేతనందరు నాపదవులనేగోరుదురు, క

లనోఁయేనుఁగునెక్కి మేలుకొనినయేమిలేనటుల పదవులన్ని యునుమాయ, స్వప్నమువంటి వేగాని నిల్కడగానుండునవికావు, శుభ్రమరూపకమైనపదవులనుగోరువారికి జననమరణములుండును, అవి ఉపాధిద్వయముతోఁ గూడుకొనియున్నవి గావున్నట్టి యీపదవులకు మితిమేరలుండును, నిత్యములుగానుండునవికావు. కల్పనాసహితములు. భ్రమవల్లనేయుండునవి. మాయామయుండైనపరమాత్మునిపదవులే యనిత్యములగుచుండగా, నిద్రేయుండగులయిందెము త్రిగుణస్వరూపులైన బ్రహ్మ,విష్ణు,మహేశ్వరులపురములు యెంతమాత్రము-అనగా ఎంతటిస్థిరములు, కల్పనారహితమైనపరమపదమేనిత్యము, ఉపాధిద్వయరహితమైన పరమపదమేస్థిరము, సుఖదుఃఖరహితమైన పరమపదమేనిత్యము. బంధమోక్షరహితమైన పరమపదమేశాశ్వతము, సర్వలోకములయందును, సర్వకాలములయందును, సమస్తదేశములయందును, సమస్తవస్తువులయందును, నిండియుండునది పరమపదము. వేదాదిగ్రంథములు సంప్రాప్తమే లేదు, బంధమోక్షములనెఱుంగదు. సాధకవిద్యలకందదు, ఆచార్యకటాక్షమునుబొందినవారికి మిగులసులభము, అత్యంత సునాయాసము, ఆచార్యకటాక్షమునకుఁబిదప మాటలతోఁ జేటందుకుయేమిలేదు, ఇదియే వేదాంతము, పరమరహస్యము. గురుగోప్యమని చెప్పిన యాశిష్యులు స్వామీ గురుశిష్యులెట్టివారు, వారిధర్మములెట్టివి దయతోఁ సెలవిచ్చుడని వేడిన యాగురువరుండిట్లనియె.

శిష్యులారా తల్లి, తండ్రి, గురుఁడు, దేవుఁడనియున్న దిగనుక తల్లి బిడ్డకుఁ దండ్రినిఁజూపించినటుల గురుఁడు శిష్యునకుం దేవునిఁజూపింపవలయును, అటులజూపించినవాఁడేయాచార్యుఁడు, దేవునింజూచినవాఁడే శిష్యుఁడు. నిజస్వరూపమునుబొందించినవాఁడే యాచార్యుఁడు, జననమరణప్రవాహమునుండిదాటించినవాఁడే యాచార్యుఁడు. నీకువేదశాస్త్రములు ప్రమాణములుగావని చెప్పినవాఁడేయాచార్యుఁడు, పరమపదమందునిలిపినవాఁడేయాచార్యుఁడు,బంధమోక్షములును,సుఖదుఃఖములును, కులభేదజాతిభేదములును,మతాభిమానములును లేకుండజేసినవాఁడేయాచార్యుఁడు. ఆచార్యుఁడు దేవుఁడు నొక్కటే. ఆచార్యునికటాక్షమేపరమపదము, ఆచార్యునికటాక్షమేపరిపూర్ణము, ఆచార్యునికటాక్షమే బంధ

యీగురుతుయెరిగెశరీరము యేమిలేదనువారేభాగవతులు, నిజగుహ
సాంప్రదాయమెరింగినవారేభాగవతులు, భాగవతులేకైంకర్యపరులు,
ఆచార్యునకువివిధశుశ్రూషలుగావించుటే కైంకర్యము, ఆచార్యునిగృ
హమందు వివిధకృత్యములను జరుపుటేకైంకర్యము, తనుమనోధనము
ల నాచార్యునకుసమర్పించుటే కైంకర్యము, కైంకర్యమువలననేజన్మ
రాహిత్యము, జన్మరాహిత్యమే పరమపదము, ఇదియేవేదాంతము.

గురుడేఆచార్యుడు, ఆచార్యుడేదేశికోత్తముడు, దేశికోత్తము
డేగురుడు, గురువును నరుడనుచుదలచినవారే గురుద్రోహులు, గురు
మంత్రమును మఱచినవారేగురుద్రోహులు, గురుపుత్రులనాదరణయొ
నర్చనివారేగురుద్రోహులు, గురునాజ్ఞకుమించినవారేగురుద్రోహులు
గురునితోనబద్ధమాడినవారే గురుద్రోహులు, తనుమనోధనముల నా
చార్యునకుసమర్పించనివారేగురుద్రోహులు, మానాభిమానములనుగ
లిగి గురునియెదుటవర్తించువారేగురుద్రోహులు, లోభగుణముచేతగు
రుదర్శనముచేయనివారేగురుద్రోహులు, త్రికరణశుద్ధిగాదేశికోత్తము
ని నారాధించనివారే గురుద్రోహులు, కపటాత్ములై వినయమునుజూ
పువారే గురుద్రోహులు, దాసులవగిదివర్తించనివారే గురుద్రోహు
లు, శరీరయాత్మలుతామనిభావించువారేగురుద్రోహులు, నిజస్వరూప
మునుబొందియును గుఱుతుయెరిగినవారేగురుద్రోహులు, వారికినరక
ముతప్పదు, ఇదిగురువాక్యము.

మతములవారు వారివారి తమదేవతలే జగత్కారణంబని పిడి
వాదముగా వాదింతురు. మతదేవుళ్లే, అబద్ధప్రపంచమునకు కార
ణమైనయెడల కార్యమెవ్వరు, కార్యములేక కారణమును, కారణము
లేక కార్యమునులేదు. గనుక కారణము విత్తువంటిది, కార్యముచెట్టు
వంటిది, విత్తనములేకచెట్టును, చెట్టులేకవిత్తనమునులేదు. గనుక
రెండును బ్రపంచమువలె మిథ్యారూపకములు, ఎండమావులయం
దునీళ్లులేనటుల విచారణ పరులకుగాని భ్రమనిరాసకముగా నెందు,
భ్రమచేతనుండు నవేమతములు, అహంకారస్వరూపములేమ తములు,
అహంకారములేకుండినవారికి మతములతోటి కులములతోటిపనిలేదు.
అహంకారముచేతనే జన్మములు, మతములను మతదేవతలనునమ్ము

టనిష్ప్రయోజనము. మతములనువిచారించిన కొన్నిభ్రమయని స్థిరించును, ఆహా భ్రాంతిలేకుండుట సహజమువదము. సంసారానిత్యులుభ్రమ, శంఖుచక్రాంకితములను ధరించుటభ్రమ, తిరుమణిశ్రీచూర్ణములను ధరించుట భ్రమ. లింగకాయలను గట్టుటభ్రమ, విభూతిరుద్రాక్షమాలలుదాల్చుటభ్రమ, గుడిగోపురములకుంబోవుటభ్రమ. ప్రతిమారాధనభ్రమ. కాశీరామేశ్వరములకుంబోవుటభ్రమ. భ్రమనొల్లనిజంగమయోగులు, భ్రమనొల్లనేప్పుడు శిష్టులు, భ్రమవిల్లనేపుణ్యపాపములు. ఈభ్రాంతిరజ్జుసర్పభ్రాంతి. అదియెట్టిదనిన యొక్కరిమొక రహదారిబాటలో నొకత్రాడు లావుగాను, నిడివిగానుపడియుండెను. దానింజూచి పెక్కండ్రుమనుష్యులు సర్పమనిభయపడికొందఱు ప్రాణవియోగముచేఁబొందిరి, కొందఱు మూర్ఛిల్లిరి, కొందఱుభయముచేతంబడి గాయములనుగట్టుకొనిరి,కొందఱుప్రాణభీతిచే పరుగుపారిపోయి పట్టణమునంజెప్పిరి,పురిలోనిజనులందఱుకలవరమునొంది గుంపులుగుంపులుగాగూడి పెక్కువిధములయోచించుచుండిరి. ఇట్లుండగానొకబాటసారి యామార్గమునవచ్చుచు నారజ్జువునుంజూచి సర్పమనిభ్రాంతిపొంది, కొంతదూరము వెనుకకుంబోయి నిదానించి యారహదారిబాటలోనిసర్పము కదలక మెదలకయుండుటకుంగారణమేమని పెద్దలుచెప్పినదనిచేసెను, రాళ్లువిసరికొట్టెను. అందుకళ్లునుయది చలించకుండిన మెల్లమెల్లగాబోయి కఱ్ఱతోగదలించి చూచిత్రాడని తెలుసుకొని సర్పభ్రాంతినివిడిచి యాత్రాడునుహస్తమునంబుచ్చుకొని ఓహో త్రాడా నీవు నాకెంత భయోత్పాతమును బుట్టించితివి, ఆహా శరీరయాత్రలు నీనిదానవు, ఏకాలమందునునీవుగారికి యుండవు, యేమిలేనినీయందు సర్పభ్రాంతిపుట్టుచున్నది, చచీనీయందు యేదోషమునులేదు. నిన్నునుయితరులనుయెఱుంగవు, యేజాలినీకుపట్టదు. ఆహా యెంతమందిభ్రమచేతంబడిరి. ఇందుకునీవేకారణము, నీవేకార్యము, కార్యకారణములెఱుంగవు, ఈరెండునుభ్రమ, నీకుందెలియకనేనీయందుమాయపుట్టుచున్నది. పండితపామరులు యిదితెలియనేరక భ్రమనునీవుపుట్టించినటుల చెప్పుదురు. ఏకాలమందును భ్రమనునీవుపుట్టించలేదు, నీవుయేమిలేనిత్రాడువలెయుచటదూరముగాబడవైచిభ్రాంతియెంతమాత్రమునులేక పురిలోనికివచ్చి యందుగుంపులుగుంపులుగా

గూడియుండినజనసమూహములనుజూచి, ఓహో మిత్రులారా గాబారేలపడెదరు, అది యేమిలేనివుత్తత్రాడు, సర్పభ్రాంతినింబొంది బహుమందిజనులుపడిపోయిరి. అదిసర్పముగాదు, నిజముగాత్రాడు నేనుజక్కగా పరిశీలించి చూచియేభ్రాంతినిబొందించని యీయుత్తత్రాడునుంబట్టిదూరముగాబడవైచివచ్చితిననియదార్థమునుజెప్పిన, యాభ్రమికులతని నిజవర్తమానమును పబ్బగయనితలంచిచాలు చాలునిలుపునీమాటలు, నూర్గురు మరణించిరి, మున్నూర్గురుమూర్ఛిల్లిరి, బహుమందిపడి గాయములనుకొట్టుకొనిరి, వేలకొలదిజనులు భయముచేతపరుగుబారివచ్చిరి, యింతమందిసర్పమనిచెప్పుచుండగాఁ నీవొకడవు త్రాడనిచెప్పుటెట్లు, పొమ్మనిపరిహసించిరి. కాఁబట్టియాభ్రమికులకెన్నివిధములజెప్పినను యెన్నిదృష్టాంతములుజూపించినను వారునమ్మరు. వారికి సర్పభ్రాంతియేపుట్టుచుండును. నిజమెఱింగివచ్చి త్రాడనిచెప్పిన యీపుణ్యపురుషుఁడు సర్పమనికోట్లకొలది జనులుచెప్పి పెక్కుదృష్టాంతములుజూపించినను, యతడు త్రాడనియెంచునేగాని సర్పమని భ్రాంతిబొందడు. కాబట్టి నిజముగా బ్రహ్మమును దర్శించినవారికిందప్ప యితరులకు నీభ్రాంతిపడునను. భ్రాంతిచేతనేపండితపామరులు, వేదశాస్త్రములనుగల్పించిరి. అచలపరిపూర్ణబ్రహ్మమునందు భ్రాంతివలనం బ్రపంచముతోచుచుండును. నిజగురుకటాక్షముచేతగానిభ్రమవిడువదు. భ్రమవిడుమటేపరమపదము, పరమపదమే వేదాంతము, వేదాంతమే సత్యము. వేదములు భ్రమసూచకములు వేదములు మాయయొక్కనేజెప్పుటనుబట్టి వేదములు సత్యములుగావు, పరిపూర్ణమే సత్యము, ఈపరిపూర్ణమునకంటెయేమిలేదు. సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును నిండియున్నదేపరిపూర్ణము. అంతయు నీవత్తపరిపూర్ణము, ఇంతకంటెనేమిలేదు, మాయయొక్కమూలములేదు, లేనియొక్కలేనేలేదు, ఈపరిపూర్ణములేకపోను, మూలములేని యీగురుతెలిసిశరీరమేమిలేదు, కలలోవచ్చినశరీరము మేలుకొనినయేమిలేను, అంతయునీవుత్తబట్టబయలు, దీనికంటెయేమిలేదు, లేనిప్రపంచములేనేలేదు, లేనియొక్కలేనేలేదు, లేనిమాయలేనేలేదు, లేనిభ్రమలేనేలేదు, అంతయునుశక్కు. ఈపరిపూర్ణమునకంటెయేమిలేదు, ఉండేదంతయు నచలము, అచలమునకంటెయేమిలేదు, ఇదివేదాంతము, ఇదసత్యము.

ఈ వేదాంతగ్రంథమును జదివినవారును, వినినవారును, మోక్షమును బొందుదురు. ఆచార్య కటాక్షముచేత విచారణ చేసినవారు భ్రాంతినిరాసకంబైన పరమపదమును బొందుదురు. ఇందుకు సందియములేదు, ఇది గురువాక్యము, గురువాక్యమే వాగ్దాంతము, వాగ్దాంతమే సిద్ధాంతము,

ఇదిశ్రీమద్వేదాంతవిచారకుండును, సద్గురుశిష్యుండును, సచ్చిదానందరహితుండును, ఉపాధిద్వయదోషరహితుండును, అచలుండును, అశరీరుండును నైనశ్రీకల- శేషాచలమునాయనివారిచేరచియింపఁబడిన శ్రీరామహృదయంబనుషట్చక్రవర్తులయింద్రజాలపుకథలుసర్వంబునుసంపూర్ణము.



